# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును

**3 ఔన్సుల బుడ్డి రు. 1 – 25 న.పై**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3 – 10    6 ఔ॥ రు. 5 – 50**

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతుదోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3 – 0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2 – 0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహాజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4 – 0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట మద్రాసు–14.**

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు, బెంగుళూరు**

19/2

ఒక అవసరానికి

# పొదుపు

చేయండి



మీ పిల్లల చదువులకు



వారి పెళ్లిళ్లకు



పని చాలించుకున్నాక మీ సుఖానికి



మీ కుటుంబానికో ఇల్లు కట్టుకోడానికి

ఇలాగ ఏదో ఒక అవసరానికిగాను—ప్రభుత్వం ప్రవేశపెట్టిన

## కొత్త
## గడువు డిపాజిటు పొదుపు పథకం లో

ప్రతి నెలా మీ పొదుపు ధనాన్ని మదుపు పెట్టండి.

| | | |
|---|---|---|
| నెలసరి డిపాజిట్లు |  | ప్రతి నెలా రు 5 నుండి రు 200 వరకు |
| నెలసరి రు 10 ల డిపాజిట్లపై లభించేది |  | అయిదేళ్ల తర్వాత రు 650; పదేళ్ల తర్వాత రు 1,450 లు లభిస్తాయి. |
| డిపాజిటు పరిమితి |  | ఒక్కరు రు 12,000 లు; ఇద్దరు వ్యక్తులు కలసి అయితే రు 24,000ల వరకు డిపాజిటు చేయవచ్చును. |

పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు వారు గాని



## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

వారు గాని ఈ పెట్టుబడుల విషయమై పూర్తి వివరాలు మీకు సంతోషంతో అందజేస్తారు.

DA 58/364

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] ఫిబ్రవరి 1959 [సంచిక ౨

# వి ష య సూ చి క

—(౦)—

ముఖచిత్రము :

జయంతి పిక్చర్స్‌వారి 'పెళ్లినాటి ప్రమాణాలు'
చిత్రంలో కుమారి జమున



నేత నేయుచున్న అమెరికన్ వనిత




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# చేనేత సప్తాహము

మన ప్రధాన జాతీయ గృహపరిశ్రమలలో చేనేతపరిశ్రమ ఒకటి. చేతితో నూలువడికి నేసి ప్రజావసరాలను తీర్చగలిగిన చేనేతపరిశ్రమ జాతీయరంగంలో అవసరాలతోబాటు అనేక వృత్తులవారికి జీవనోపాధిని కల్పించిన రోజులు గడచిపోయినవి. నూలు ఉత్పత్తిని మిల్లులు చేసినా చేనేతపరిశ్రమ యీ నాటికి సజీవంగా నున్నదంటే కొన్ని విధాల మిల్లుగుడ్డకంటె చేనేతగుడ్డ మెరుగు కావడమేనని చెప్పవచ్చును.

చేనేతగుడ్డను మిల్లుగుడ్డపోటీనుండి తప్పించి సరసమయిన ధరలకు ప్రజల కందించుట కనువుగా నూలు పుష్కలంగా సప్లయి చేయడం, పంచలు, తుండుగుడ్డలు, చీరలు లాంటి రకాలను చేనేతపరిశ్రమకు ప్రత్యేకించడం యీ నాటి చేనేతపరిశ్రమావసరాలు. ఈ అవసరాలుతీరితే చేనేత వర్ధిల్లడానికి, చేనేత పారిశ్రామికులు ఉద్ధరించడానికి అవకాశాలు అధికంకాగలవు. ఈ విషయాలను వదిలేసి విదేశాలకు చేనేత

గుడ్డ ఎగుమతులపైననే దృష్టిని కేంద్రీకరించి ఉత్పత్తులు పెరుగడంకోసం పవరుమగ్గాలను, ఆటోమాటిక్ మగ్గాలను ప్రవేశపెడితే చేనేతకుఉన్న శాస్త్రకౌశలముపిరిపోతుందని అనుభవజ్ఞులవాదం.

జాతీయ సౌభాగ్యము దృష్ట్యా విదేశములకు చేనేత గుడ్డల ఎగుమతులు అవసరమే కావచ్చు. ఎగుమతుల నుద్దేశించిన ఉత్పత్తులకు పవర్ లూమ్స్, ఆటోమాటిక్ లూమ్స్ విరివిగా వినియోగించవచ్చును. కాని ప్రజావసరాలను తీర్చగల చేమగ్గాలను విడనాడాలని ప్రబోధించడంగాని, ప్రోత్సహించడంగాని చేనేతపరిశ్రమకు తోడ్పడజాలవు.

ఎంత ఆకర్షణీయంగాను, చౌకగానున్నా మిల్లుగుడ్డను విడనాడి చీరలకు, పంచలకు, తుండుగుడ్డలకు చేరుమాళ్లకు ప్రజలు చేనేత గుడ్డవైపే మొగ్గుతున్నారంటే ఆ ప్రజాదరణను ప్రభుత్వము పదిలముచేయవలసియున్నది. చేనేత పరిశ్రమలో మరింతగా నిరుద్యోగాన్ని పెంచగల ఏవిధానమయినా అవాంఛనీయమే. చేనేతగుడ్డను మిల్లుగుడ్డపోటీనుండి తప్పించి, గుడ్డ ప్రజల అభిరుచి కనుగుణంగా, నాణ్యంగా తయారుకావడాన్ని ప్రోత్సహించి ధరవరలలో మిల్లుగుడ్డతో సమానంగానో లేక, దానికంటె తక్కువధరలకో లభ్యమయ్యేలాగ విధానాలను ప్రభుత్వము రూపొందించవలసియున్నది.

ఈ చేనేత సప్తాహ సందర్భమున ప్రజలు చేనేత వస్త్రాలవిశిష్టతను, గత మహోజ్వలచరిత్ర దృష్ట్యా చేనేతపరిశ్రమను ఆదరించి ప్రోత్సహించవలసిన ఆవశ్యకతను గుర్తించి చేనేతపరిశ్రమకు పదిలమైన భవిష్యత్తు రూపొందుటకు తోడ్పడుదురుగాక !

## మంచి సలహా

జనాభాపెరుగుదల నరికట్టుటకు యీమధ్య కుటుంబ నియంత్రణ విధానాల నమలుపరచుటకు ప్రభుత్వము ఎక్కువ ఆసక్తి చూపుచున్నది. జనాభా పెరుగుదల నరికట్టవలసిన అగత్యము ఎంతయున్నా సంతాన నిరోధాన్ని ఉద్దేశించి కృత్రిమమార్గాలను, సాధనాలను చేబట్టడం క్షేమకరంకాదనునది ఒకవాదం. ఈ వాదమును బలపరచేవారు కృత్రిమ పద్ధతులు, మందులద్వారా ప్రజల ఆయురారోగ్యాలు క్షీణించగలవని చెప్పుచున్నారు.

అయితే సాంఘిక ఆయురారోగ్యాలదృష్ట్యా నయితేనేమి, ఆర్థికస్థితిగతులు పదిలమగుటకయితేనేమి జనాభా పెరుగుదల ముమ్మాటికి అరికట్టవలసేయున్నది. అందుకు మార్గము హైదరాబాద్ గవర్నర్ శ్రీ భీమసెన్‌సచార్‌గారు చెప్పినట్లు వివాహితులు బ్రహ్మచర్యమును అమలుపరచుట కాగలదు. అంటే వివాహితులు తమ జీవితమును క్రమబద్ధముగా రూపొందించుకొనుటకు సంసార సుఖాలపట్లనే ఆసక్తిని కేంద్రీకరించకుండా ఆధ్యాత్మిక, పారమార్థిక, సేవాచింతలపై కేంద్రీకరించి కుటుంబ పరిస్థితులతోబాటు సంఘపరిస్థితులను చక్కదిద్దుకున్నచో జనాభా పెరుగుదల పరిమితం కాగలదు; దివ్యత్వాన్ని సయితముపొంది ఇహపరాలలో సుఖపడగలరు.

——(o)——

## "ఆ శీ స్సు"

శ్రీ మరువాడ సూర్యప్రకాశం



చేనేత వస్త్రాలు — జనులెల్ల కట్టాలి
చేనేతపరిశ్రమకు — చేయూత నివ్వాలి

చేనేత చీరలే — స్త్రీలెల్ల వాడాలి
ఈనేత గాళ్లంత — ఇల్లె వర్థిల్లాలి

చేనేత చీరలను — చూడవే సోదరీ!
ఆనేత అందంబు — అందుకో సోదరీ!

రంగు రంగుల చీర — రాణించునమ్మ
ఎఱుపురంగు చీర — ఎంతో బాగమ్మ
పసుపురంగు చీర — పడతి కావలెనా?
నలుపురంగు చీర — నాతి కావలెనా?
నీలిరంగు చీర — నీవుయెరుగుదువా?
ఊదరంగు చీర — కూర్మితోనడుగు

నాచురంగు చీర — నీకు నచ్చినదా?
తెలుపువన్నె చీర — తేటుగానుండు.
చిలుకాకుపచ్చెంతో — చోద్యమాయమ్మ!
ఏరంగునచ్చెనో — ఎన్నుకోతల్లి

నేత చీరలుకట్టు — నేర్చుకోవమ్మ
నేత గాంద్రకుకూడు — నీవె పెట్టాలి.
నేత చీరలబిగువు — నీ వెరుగవమ్మ
పాతబడినను గాని — పట్టొగ్గదమ్మ.

నేతచీరలసొగసు — నీవెరుగవమ్మ
నాతులకందంబు — నేతయుడుపమ్మ

మానంబు కాపాడు — మంచిదుస్తులనె
ధరియించి దగదగ — వెలుగొందవమ్మ. ||చే||

——(o)——

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(గత సంచిక తరువాయి)

ఇవి ఎన్నటికీని అమృతస్వరూపములు కాజాలవు. ఇవి నశించునవి కనుక వీటివలన జ్ఞానికి అమృతపదవి రాజాలదు. శ్రుతిభాగములను వాక్యములయందు వెదుక కూడదు. లక్ష్యార్థమును గమనించవలెను.

మనయందుండు అసత్య తాదాత్మ్యములను తొలగించుకొని మన నిజస్వరూపమును స్థాపించుకొన జ్ఞేయ ప్రయత్నమును ఆత్మ సాక్షాత్కారమనబడును. ఈ మర్త్యదేహము నేను కాదు. అమృత ఆత్మస్వరూపుడను నేను అని తీక్ష్ణ ఆత్మానుభవము పొందగలిగినచో పిమ్మట మరణమువల్ల ఎట్టి భీతియు కలుగదు. అతని మరణమువల్ల ఎట్టి బాధకలుగదు. మరణము నిత్యవ్యవహారములలో నొక అంశముగనుండును. ఆహారము పుచ్చుకొనుట, గంగలో స్నానముచేయుట వంటిదిగా నుండును. మరణమునగ నూతన వస్త్రములు ధరించునట్లుండును. అంతియే కాదు. దుర్గంధ పంజరమును తొలగించుకొను ఉపాయముగానుండును. ఇంతకాలము ఆత్మ నియామకము వల్ల అచ్చట బంధింపబడియుండెను. ఇక బంధనములు లేవు.

—o—

## తృతీయ ఖండము

ఈ తృతీయ ఖండమున ఇదివరకు విమర్శించిన సత్యముల సాంకేతిక కథా రూపమున తెలుపబడుచున్నది.

ఒక కాలమున పరమాత్మ సహాయమువలన దేవతలు రాక్షసులను యుద్ధమునగెలిచిరి. దేవతలు విజయమువల్లకలిగిన గర్వాంధకారమున తమప్రతాపములను చాటించుకొనుచుండిరి. దేవతల క్షేమార్థము పరమాత్మ దేవతలముందు ఒక యక్షునిరూపమున ప్రత్యక్షమాయెను.

అద్భుతమగు ఆ దృశ్యమును చూచి దేవతలు ఆశ్చర్యచకితులయిరి. అగ్ని దేవతను ప్రతిమాలి ఆ భూతము ఏమిగాయుండవచ్చును, కనుగొనమని ప్రార్థించిరి.

అగ్నిదేవుడు సమ్మతించి తనశక్తి సామర్థ్యముల యందు దృఢనమ్మకముతో ఆ భూతమును సమీపించెను. ఆ భూతము ప్రశ్నించినందుకు సమాధానముగ, తాను పౌరుషవంతుడగు అగ్ని దేవుడనియు, ప్రపంచమునంతయు తాను దహించగలడనియు తెలిపెను. భూతరూపమునయున్న పరమాత్మ ఒక గడ్డిపోచను అగ్ని దేవునిముందు ఉంచి, దానిని భస్మముచేయ ప్రయత్నించుమనెను. సూర్యనకు నక్షత్రములకు అధిదేవతయగు అగ్ని దేవుడు సర్వప్రయత్నములు చేసినను, ఆ గడ్డిపోచ కొంచమయినను వాడలేదు.

ఇట్లు తనకు గర్వభంగముకాగా మరలిపోయెను. దేవతలు అతడు వెళ్లిన కార్యఫలమేమని అడుగగా నాకు తెలియదు అని జవాబుచెప్పెను. యక్షుని మర్మము తెలియగోరిన దేవతలు రెండవమారు వాయుదేవుని ఆ యక్షు డెవరో కనుగొనమనిపంపిరి. అగ్ని కన్న తనకు అధిక కీర్తి ఆశించి, అహంకార ఉద్రేకముతో వాయుదేవుడు విచారించను వెళ్లెను.

రూపులేని పరమాత్మ ఒక రూపము ధరించి, తన్ను సమీపించు వాయుదేవుని గర్వమును గమనించి, అతనివైపు చూచెను. అతడెవరని ప్రశ్నించెను. వాయు దేవుడు తన ప్రతాపమును తెలుపుకొనుచు,

ఈ ప్రపంచమునంతయు ఎగురగొట్టగలనని తెలిపెను. యక్షుడు ముందటి గడ్డిపోచను అతనిముందుంచి, కదలించుమనెను. పరమాత్మ కటాక్షములేనిది ఎట్టివాడు కాని, ఏ కార్యమును చేయజాలడు. పాపము, వాయుదేవుడు తన నిస్సారమునకు వగచుచు గడ్డిపోచను కదలింపజాలక మరలిపోయెను.

అగ్ని దేవుడు, వాయు దేవుడు, ఇరువురు తమరాయ భారమును నెరవేర్చలేకపోగా, దేవతలందరుకూడి దేవతల ప్రభువగు ఇంద్రుని వేడుకొనిరి. వారిప్రార్థన నంగీకరించి, దేవేంద్రుడు యక్షునివద్దకు వెళ్లెను. సమీపించు దేవేంద్రుని గర్వమడచుటకు అతని నిస్తేజమును ప్రకటించుటకు, యక్షరూపము అంతర్ధానమాయెను.

కాని ఇంద్రుడు మిగత దేవతలవలె అహంకరించి యుండలేదు. యక్షుడు అంతర్ధానమగుటవలన ఇంద్రునికి నిరుత్సాహము కలుగలేదు. రూపుమాయమగుటవలన విచారించు కుతూహలము అధికమాయెను. నిరాశతో వెనుకకు మరలిపోక, కుతూహలముతో ముందునడువసాగెను. యక్షుడు అదృశ్యమయిన స్థలమున, ఉమాదేవి హిమవంతుని పుత్రి, సర్వాభరణభూషితయై, ఇంద్రుని విచారమున ఆశీర్వదించ ప్రత్యక్షమాయెను. ఆమెను ఇంద్రుడు విచారించెను. యక్షుడు పరబ్రహ్మము. దేవతలకుగల విజయగర్వమును సకాలమున సరిదిద్దుటకై నిత్యసత్య అద్వితీయ పరబ్రహ్మము, నామరూపముతో ప్రత్యక్షమై ఆశీర్వదించ అవతరించెనని ఆమెవలన ఇంద్రుడు తెలుసుకొనెను. — జై జై సచ్చిదానంద !

## ఇందలి రహస్యము

ఇందలి కథా భాగము వినుటకు వింతవలెగా తోచును. శ్రద్ధావంతుడగు సాధకుడు, ఇట్టి పిట్టకథలయందలి యక్షస్వరూపమును విమర్శించి, తెలుసుకొని, లాభము పొందవలసియున్నది. శ్రుతియందు ఇట్టి కథా రూపమును ప్రకటించుటయందలి అంతరార్థమును తెలుసుకొన పరిశ్రమచేయవలెను.

ఈ కథయందు ఇంతవరకు విమర్శింపబడిన ఉపనిషత్సత్యమును విపులముగ మరల తెలుపబడుచున్నది. ఆత్మయొక్క నైజము ఆత్మశక్తిని, తీక్ష్ణవేదాంత విచారరీతి ప్రత్యక్ష నాటకమువలె తెలుపబడియున్నది.

ఈ కథయందలి అగాధభావమును తెలుసుకొనుటకు శాస్త్రజ్ఞానము కొంత అవసరముగనున్నది. అవ్యక్తమునుండి, వ్యక్తప్రపంచముక్రమముగ సూక్ష్మమమునుండి స్థూలము అభివృద్ధి పొందుచు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అని స్థూలతమముగ పృథ్వీరూపముతో ముగియుచున్నది.

ఈ పంచ భూతములకు ఒకొక్క స్వగుణము ప్రత్యేకముగనున్నది. ఆకాశమున శబ్దము స్వభావగుణము. వాయువునకు శబ్దముతోకూడ స్పర్శఅను స్వగుణము కూడియున్నది. అందువలన దీనికి శబ్దము, స్పర్శము రెండు గుణములున్నవి. ఇదే రీతి మిగత భూతములు, వాటిపై వాటి గుణములతోకూడ తమ స్వగుణములుకూడియున్నవి అగ్నికి శబ్ద, స్పర్శతో, రూపము స్వగుణముగయున్నది. జలమునకు శబ్ద, స్పర్శ, రూపముతో, రసము స్వగుణముగాకూడియున్నది. పృథ్వియందు పైనాలుగు గుణములతో కూడ, గంధము స్వగుణముగకూడియున్నది.

ఇట్లుండుటవల్ల పై పంచగుణములను గ్రహించగల జ్ఞానేంద్రియములను ఈ పంచభూతములు అధిష్ఠించియున్నవనుట శాస్త్ర సమ్మతము. చెవివల్ల శబ్దము వినుచున్నాము. శబ్దము ఆకాశగుణము. ఆకాశము చెవికి అధిష్ఠానదేవత. చెవితో, అగ్నియొక్క స్వగుణముగు రూపమును తెలుసుకొన జాలము.

ఇంతమాత్రపు శాస్త్ర జ్ఞానము పొంది, ఈనిస్సార కథను మరల చదివినచో, కేనోపనిషత్తునందు దీనిని తెలుపుటకుగల యోగ్యతమునను తెలియగలదు.

ఈ కథాభాగమునగల భావయందు ఎట్టి కాఠిన్యతము కనుబడుట లేదుగనుక, ఉపనిషత్తు మంత్రములను తెలిపి వాటి అనువాదమును కూడ వరుసగా కనుపరచెదము.

(సశేషము)

# చేనేత వస్త్రాల నాణ్యాం పెంపొందించడంలో శ్రద్ధ

ఎక్కువగా వహిస్తే దేశానికి ఖ్యాతి, పరిశ్రమకు అభ్యున్నతి లభించగలవని
"సప్తాహ" సందర్భంలో దేశనాయకుల హితవు

ఆరవ అఖిలభారత చేనేత సప్తాహం 1959 ఫిబ్రవరి 8 వ తేదీనుంచి 15 వ తేదీ వరకు దేశవ్యాప్తంగా జరుగుతోంది. ఈ సందర్భంలో రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి, వివిధ కేంద్ర మంత్రులు, రాష్ట్రాల ముఖ్యమంత్రులు శుభాకాంక్షలు తెలియజేస్తూ సందేశాలు పంపారు. ఈ సందేశాలు యీ క్రింద పొందుపరచబడినవి:

రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్:—

"చేనేత వస్త్రాలను స్వదేశంలోనేగాక కొన్ని విదేశాలలో సైతం బహుళ ప్రచారంలోకి తేవడానికి అఖిలభారత చేనేత బోర్డు చేస్తున్న కృషి క్రమంగా ఫలిస్తున్నది. ఇందుకు ఈ వారోత్సవాల సందర్భంలో అఖిలభారత చేనేత బోర్డును అభినందిస్తున్నాను.

భారతదేశ చేనేత పరిశ్రమ ఉత్పత్తిని పెంపొందించి మొత్తంమీద లోగడ సంవత్సరాలలో హెచ్చు ఫలితాలను సాధించగలగడం ముదావహం.

రానున్న చేనేత వారోత్సవాలు అఖిల భారత చేనేతబోర్డు ఆశయాలను, లక్ష్యాలను ఇనుమడింపజేయడంలో విశేషంగా సాయపడగలవని ఆశిస్తున్నాను. ఈ సందర్భంలో చేనేత బోర్డుకు నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు.

వైస్ ప్రెసిడెంట్ డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్:—

"మళ్లీ ఈ ఏడుకూడా అఖిలభారత చేనేత వారోత్సవాలు జరుపుతున్నందుకు చాల సంతోషం. చేనేత వస్త్రాల ఉత్పత్తి నాణ్యాన్ని పెంపొందించడానికి శ్రద్ధ వహిస్తే, మన నైపుణ్యం ప్రపంచమంతటా వెల్లడికావడంతోబాటు విదేశ మారకపు ద్రవ్యాన్ని ఆర్జించగలుగుతాం. చేనేత వస్త్రాల ఉత్పత్తి ప్రమాణాలను పెంపొందించడానికి మీరు శాయశక్తులూ కృషి చేస్తారని ఆశిస్తున్నాను.

ప్రధానమంత్రి, శ్రీ జవహర్‌లాల్ నెహూృ:—

తమ సందేశంలో ఈ ఉత్సవాలు జయప్రదం కావాలని కోరుతూ శుభాకాంక్షలు పంపారు.

కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ మురార్జీదేశాయ్:—

"చేనేత వస్త్రాల నాణ్యం పెంచడంలోనేమి, నమూనాలు తయారు చేయడంలో

నేమి చేనేత పరిశ్రమ గణనీయమైన అభివృద్ధిని సాధించినందుకు నాకు మహదానందంగా వుంది. వచ్చే సంవత్సరంలోకూడ చేనేత పరిశ్రమ విలక్షణమైన మేలురకం వస్త్రాలను ఉత్పత్తి చేయగలదని విశ్వసిస్తున్నాను.

కేంద్ర వాణిజ్య పరిశ్రమల మంత్రి, శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి:—

''చేనేత పరిశ్రమ దేశం మొత్తంమీద లక్షలాది ప్రజలకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఉపాధి కల్పిస్తున్నది.

''చేనేత పరిశ్రమ చరిత్ర పౌరాణిక కాలంనుంచే ప్రారంభమైనది. తన సుదీర్ఘ చరిత్రలో ఈ పరిశ్రమ అనేక యిబ్బందులను ఎదుర్కొన్నది. వాటన్నింటినీ అధిగమించి ఆ పరిశ్రమ ఈ నాడు నిలిచివుండడం ఆ పరిశ్రమయొక్క అంతర్గత శక్తి సామర్థ్యాలకు నిదర్శనం. ప్రభుత్వం కరుడు గట్టిన సత్యాలను గుర్తించి గ్రామ ప్రజలకు స్వస్థానంలోనే బ్రతుకు తెరువు కల్పించడానికి యీ పరిశ్రమకు సహాయం చేస్తున్నది.

నూలు వస్త్రాల విషయంలో పోటీ తీవ్రంగావుంది. వాడకందార్లను విశేషంగా ఆకర్షించే కొత్తరకం నమూనాలను, కొంగ్రొత్త విధానాలను రూపొందిస్తేనే యీ పరిశ్రమ ముందంజ వేయడానికి సాధ్యమవుతుంది. వికేంద్రీ కృతమైన చేనేత వ్యవస్థలో కొత్త నమూనాలు, కొత్త విధానాలు ప్రవేశపెట్టడం అత్యవసరం. ఈ చర్యలన్నింటిని క్రమంగా అమలు జరిపితే యీ పరిశ్రమకు ఉజ్జ్వల భవిష్యత్తు వుంటుంది. ఈ సప్తాహం జయప్రదమగు గాక !

కేంద్ర పరిశ్రమల మంత్రి శ్రీ నిత్యానంద కనుంగో:—

''ఈ ప్రత్యేక వారోత్సవాలు యిటు ప్రజలూ, అటు చేనేత పారిశ్రామికులూ, కార్మికులూ ఆ సంవత్సరంలో సాధించబడిన అభివృద్ధిని సమీక్షించుకోడానికి అవకాశం కలిగిస్తాయి. ప్రజాస్వామ్యంలో ప్రజల అభిరుచులకు ప్రత్యేక ప్రాముఖ్యం వున్నది. ప్రజాస్వామిక ప్రభుత్వం విధానాలను రూపొందించడంలో పౌరులదే పైచేయి. ఆ విధానాలు ఆర్థిక, సాంఘిక లక్ష్యాలసాధనలో ప్రజాభిప్రాయానికి అనుగుణంగా వుండాలి.

చేనేత పరిశ్రమ చెప్పుకోదగిన అభివృద్ధిని సాధించిన దనడంలో ఎట్టి సందేహం లేదు. మేలురకం నూలు హెచ్చు మొత్తాలలో లభ్యమవుతున్నందునా, చేనేతబోర్డు అమలు జరిపిన వివిధ చర్యల ఫలితంగానూ అడ్డంకులు తొలగిపోయి తీవ్రతర అభివృద్ధిని సాధించగలుగుతాం. వేలాది మన సహచరులు, చేనేత పారి

శ్రామికులూ, కార్యకర్తలూ, సాంకేతిక నిర్వాహకులూ అభినందనీయులు. చేనేత పరిశ్రమ సాధించిన విజయాలను ప్రజల దృష్టికి తేవడానికి ఈవారోత్సవాలు విశే విశేషంగా తోడ్పడడం ఒక ముఖ్య విశేషం.

కేంద్ర పరిశ్రమల మంత్రి శ్రీ మనుభాయ్ షా:—

“ఆరవ అఖిలభారత చేనేత వారోత్సవాలు 1959 ఫిబ్రవరి 8 నుంచి 15 వరకూ దేశవ్యాప్తంగా జరుగుతాయని విని మహదానందం చెందాను. చేనేత పరిశ్రమ స్థిరీకరణకూ, చేనేత వస్త్రాల విషయంలో వాడకందార్ల అభిరుచులను తెలుసుకోడానికి యీ వార్షికోత్సవాలు తోడ్పడుతున్నాయి.

భారత చేనేత పరిశ్రమ గతంలో ప్రజల యొక్క, ప్రభుత్వంయొక్క ప్రోత్సాహ సహకారాలను పొందింది. క్రిందటి ఐదు సంవత్సరాలలోనూ భారత ప్రభుత్వం 25 కోట్ల రూపాయల వరకూ యీ పరిశ్రమకు సహాయం చేసింది. ఆ మొత్తంలో సగం ఋణ రూపంతోనూ, మిగిలిన సగం గ్రాంటు రూపంలోనూ యిచ్చారు.

ఉత్పత్తి పరికరాలను అభివృద్ధిపరచడానికి, మార్కెటింగ్ సౌకర్యాలను పెంపొందించడానికి, అద్దకం ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి గ్రాంటు మొత్తాన్ని వినియోగించారు. కొలది సంవత్సరాల క్రితం వరకు నూలు సరఫరా కొరతగా వున్నది. ఇప్పుడది తొలగిపోయి చేనేత పరిశ్రమ ప్రస్తుత అవసరాలకు పూర్తిగా నూలు లభ్యమవుతున్నది. చేనేత పరిశ్రమకు తోడ్పడే నిమిత్తం రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా పరిపూర్ణ సహకారంతో ఆర్థిక సహాయ సంస్థలద్వారా ఋణ సౌకర్యాల కల్పనకు పథకం అమలు జరుపబడింది. ఈ పథకం క్రింద అప్పుడే చెప్పుకోదగిన మొత్తాల ఋణం చేనేత పరిశ్రమకు లభించింది.

దేశవ్యాప్తంగా 9,600 చేనేత సహకార సంఘాలను నెలకొల్పి 12 లక్షల చేనేత మగ్గాలను సహకార వ్యవస్థ క్రిందకు తెచ్చారు. చేనేత వస్త్రాల ఉత్పత్తి 1958 లో 175 కోట్ల గజాలకు పెరిగింది. 1948 లోని ఉత్పత్తి 120 కోట్ల గజాలు. ఈ అభివృద్ధి కృషి చేనేత పరిశ్రమ ప్రగతికి నిదర్శనం. ఇందుకు చేనేత రంగంలోని వారందరు అభినందనీయులు.

(114 వ పేజి చూడుడు)

# చేనేత పరిశ్రమ - సహకారము

## ఆంధ్ర ప్రదేశ్ ముందంజ

శ్రీ వి. వి. జీవో

—(०)—

భారతదేశపు కుటీర పరిశ్రమలలో చేనేత పరిశ్రమదే అగ్రతాంబూలమని చెప్పవచ్చును. ఎందువల్లనంటే, లక్షలాది ప్రజకి దీని మూలంగా బ్రతుకు తెరువు లభిస్తోంది. కేవలము అనేకమందికి జీవిత మేర్పరుస్తున్న కారణంగా మాత్రమే యిది ప్రధాన పరిశ్రమని కాదు. తరతరాలుగా వంశపారంపర్యంగా చేనేత పారిశ్రామిక కుటుంబాలలో యీ అపూర్వమైన వృత్తికి సంబంధించిన నైపుణ్యం దక్షతః సంక్రమించివుండడంవల్ల, యీ పరిశ్రమకి జగద్విఖ్యాతి యేర్పడడం రీత్యానూ, అందుమూలంగా భారతదేశానికి పేరు ప్రఖ్యాతులు యినుమడించడం రీత్యానూ గూడా యీ పరిశ్రమ మన కుటీర పరిశ్రమలలో ప్రధానమైనదని చెప్పాలి.

ఆలిండియా హాండ్‌లూమ్‌బోర్డు యీ పరిశ్రమ ప్రస్తుత పరిస్థితికి రెండు కారణాలున్నాయని గ్రహించింది. ఒకటి, మానవ సంబంధమైనది, రెండవది, వృత్తికి చెందినది. చేనేత పారిశ్రామికునకు సంబంధించినంతవరకు యిది వంశపారంపర్యంగా చేనేత వస్త్రాలను వుత్పత్తి చేయడానికి సంబంధించినది. ఎన్ని అవాంతరాలు వచ్చినా అతగాడు యీ వృత్తిని విడిచిపెట్టలేదు. ఇక రెండవది, అంటే అసలు వృత్తికి సంబంధించినది — పనిముట్ల విషయము. పనిముట్లేగాక, (యివి చాలా పాతకాలపువి) నిష్ఠురమైన దారిద్ర్యమూ, కావలసిన ముడిపదార్థాలు సరసమైన ధరలకు లభ్యమయ్యేటట్లు చేసే సరియైన సన్నాహము లేకపోవడమూ, తయారైన చేనేత వస్త్రాలను గిట్టుబాటు ధరలకు అమ్మకం చేసే ఏర్పాట్లు లేకపోవడము, యివన్నీ కూడా చేనేత పారిశ్రామికునికి యీ పరిశ్రమ ఆర్థికంగా లాభకారి కాకుండా చేశాయి.

అందుచేత చేనేత పరిశ్రమ సుస్థిరమైనదిగా వ్యవస్థీకరించాలంటే, సహకారోద్యమం ద్వారానే సాధ్యమని హాండ్‌లూమ్‌బోర్డు భావించింది.

ఈ నిర్ణయం ఫలితంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సాధ్యమైనంతమంది చేనేత వారిని సహకార సంఘాలలో చేర్పించడానికి కృషిచేస్తున్నాయి. పరిశ్రమకు కావలసిన నూలు, రంగులవంటి ముడిపదార్థాలు సరసమైన ధరలకు వీరికి లభింపజేయడానికిన్నీ, సాంకేతికమైన సహాయ

సలహాలు యిప్పించడానికిన్నీ, తయారైన సరుకు గిట్టుబాటు ధరకు అమ్మకం చేయడానికిన్నీ యీ చేనేత సహకార సంఘాలు యేర్పరుస్తున్నారు.

వివిధ రాష్ట్రాల్లో యీ చేనేత సహకారోద్యమం భిన్న దశలలో ఉన్నది. అగ్రగణులలో ఆంధ్ర ప్రదేశ్ ఒకటి.

ఆంధ్ర ప్రదేశ్ లో చేనేత పారిశ్రామికులు చెప్పదగినంతగా తమ సంస్థల్ని, సహకార పద్ధతులమీద చక్కగా నిర్వహించుకొంటున్నారు. ఈ సంఘాలు వీరికి అనేక విధాల సహాయపడుతున్నాయి. ముడి పదార్థాలు సప్లై చేయడంలోనేమి, తయారైన సరుకు అమ్మచూపడంలోనేమి యెంతో చేస్తున్నాయి. మేలు రకపు పనిముట్లు యివ్వడానికీ, పరిశ్రమలో క్రొత్తరకపు ఉత్పత్తి పద్ధతులు ప్రవేశపెట్టడానికీ, డిజైన్లు సృష్టించే చిన్న చిన్న ఫాక్టరీలు నెలకొల్పడానికీ, తయారైన చేనేత వస్త్రాన్ని తనిఖీ చేసి నాణెపు గుర్తులు ముద్రవేయడానికీ, రకరకాల స్కీములు ప్రవేశపెడుతున్నారు.

ఆంధ్రలోవలెనే, చెన్న రాష్ట్రంలోనూ, ఉత్తర ప్రదేశ్ లోనూకూడా చేనేత సహకార సంఘాలు చక్కగా పనిచేస్తున్నాయి.

**ఎమ్మిగనూరు ఫాక్టరీ — ఆదర్శప్రాయం**

చేనేత సహకార సంఘాలు సభ్యులకు పరపతి సౌకర్యాన్ని కల్పిస్తున్నాయి. సభ్యులు, సంఘాలకు అందజేసే సరుకు రీత్యా వారికిచ్చే వేతనపు సొమ్ములో కొంత భాగం ముందుగా అడ్వాన్సు చేస్తారు. ఇందువల్ల చేనేత వారు, వారికి కావలసిన ముడి సరుకు కొనవీలవుతుంది.

ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ లోని, ఎమ్మిగనూరు సంఘం అక్కడ పనివారికి వసతి కల్పించేందుకు ఒక పథకం అమలు జరిపింది. దేశంలోవున్న ఇతర సుస్థిరమైన యిలాంటి చేనేత సహకార సంఘాలు ఎమ్మిగనూరు సంఘపు ఆదర్శాన్ని పురస్కరించుకొని వసతి పథకాలు అమలు జరపబోతున్నాయి.

ప్రాథమిక సహకార సంఘంలు, ముడి పదార్థాలు పనిముట్లుకొని, నగదుకు గాని, అప్పుగాగాని పనివారికి సప్లైచేస్తాయి. ఈ ప్రాథమిక సంఘాలు యిందునిమిత్తము రావలసిన సొమ్ము నేత పనివారినుంచిన్నీ యితరుల నుంచిన్నీ వాటాలు గానూ, డిపాజిట్లగానూ, మరేదో రూపంలోనూ సంపాదిస్తాయి. తయారు చేయించిన వస్త్రాన్ని అమ్మించి యీ రీత్యావీరికి సహాయపడతాయి. ఈ ప్రాథమిక సంఘాల వల్ల, ముఖ్యంగా ఉత్పత్తిదారులకే మాత్రమే లాభం. ఈ సంఘాల మేనేజిమెంటుమి. రాష్ట్ర చేనేత సహకార సంఘాల మేనేజిమెంటుమి, నేత పనివారి చేతుల్లోనే వుంటుంది. ప్రాథమిక సంఘా

లకు డబ్బు జిల్లా సహకార బ్యాంకులనుంచీ, సెంట్రలు బ్యాంకులనుంచీ, లభిస్తోంది. రిజర్వు బ్యాంకికూడా అప్పు యిస్తుంది.

ఈ సహకారోద్యమం వల్ల పనివారికి మధ్య రకపు మనుష్యుల బెడద పోతోంది, ముడి పదార్థాలు అందుతున్నాయి. సరుకు విడుదలవుతోంది. ఈ లాభమంతా డబ్బు రీత్యా లెక్కించడం సాధ్యంకాదు. చేనేత పరిశ్రమ సహకారం శ్రీరామరక్ష వంటిదని అందరూ అంగీకరించారు. కేంద్ర ప్రభుత్వం సెస్సునిధినుంచి యిస్తున్న గ్రాంటు సొమ్ము రాష్ట్ర ప్రభుత్వాలు శక్తివంచన లేకుండా యీ విషయంలో ఉపయోగిస్తున్నాయి.

——(o)——

# హెచ్చరిక

శ్రీ చదలవాడ సోదరీ కవయిత్రులు



మాతులుండు శ్వశురుండనంబడవు నీవు – కాని ఆధునికాచార మాను గాన
"మామ" అనెడి సంక్షిప్త నామమున మేము – పిలువఁ దలఁచితి మన్యథా తలఁపబోకు !

మామ ! ఓ చందమామ ! నీ మర్మ మేమి ? – గర్భమం దెంత మఱ్ఱి వృక్షమ్ము గలదు ?
దాని క్రీనీడ పేద పెద్దమ యొకర్తె – రాట్నముం ద్రిప్పునఁట యథార్థమ్మె యానె ?

శశకమో ! హరిణమ్మొ ! నీ సరసఁ గలదో ! – మచ్చ కేరూపముం గూర్చి మెచ్చ నగునో !
ఔర ! ద్విజరాజ నామధేయమ్ము నంది – అరుగుదెంతువు నిశ్వ విహారమునకు

రష్యనులు "ల్యూని" కాభిఖ్య రాకెటొకటి - అంపి తదుపరి వారలు నరుగుదెంత్రు
గుట్టు బైట పడున్ గద ! మిట్టి పడకు ! – సాగునే చిదంబర రహస్యమ్ము సతము ?

అంతరిక్షమ్మునందుఁ బ్రయాసపడుచు – అరుగుదెంచు రష్యనులకు, నమెరికనుల
కమృత పాన మ్మొసంగి, ఆహ్లాదపఱచి – వారితో బాంధవమ్ము నేర్పఱచుకొమ్ము !

రాజులు తరాజులైన వార్తలు గ్రహించి – ప్రజల మన్నన లందు వర్తన వెలింగి
మన్ను మిన్నేక మొనగూర్చు మార్గ మరసి – లోక కల్యాణమునకు వెలుంగవలయు !

# 'పాపం బద్ధలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

అదృష్టంచేత తరుముబడిన వాడైనాడు. వీరభద్రం రెండాటలాడగానే వున్న అయిదువందల్లో రెండొందలు పోయినయి. నిరాశచెందాడు. మిగతాదికూడా పోతుందేమోనని, భయపడి, నారాయణరావుకిచ్చేసి, "నాకు నిద్రొస్తోంది, కాస్త తలకాయనొప్పిగాకూడావుంది. యింటికెడుతాను" అని చెప్పాడు. నారాయణరావు ఆటరంధిలో సరిగా వినిపించుకోక, తలెత్తిచూశాడు. వీరభద్రం మళ్లీ చెప్పాడు. నారాయణరావు సరేనన్నాడు. అతను కదిలాడు ... వస్తుంటే — "యింటివద్ద శారద ఒంటరిగావుంది. త్వరగా వెళ్లి పడుకో! నేనూ రెండాటలాడి యిప్పుడేవస్తాను. శారదకికూడా చెప్పవస్తున్నానని" నారాయణరావు అలవాటుగా చెప్పే పద్ధతిలో చెప్పాడు. వీరభద్రంగుండెల్లో శారద తళుక్కుమంది. తన ప్రయత్నం నిర్విఘ్నంగా కొంతసేపట్లో మనస్ఫూర్తిగా తీర్చుకోవచ్చునని. పెద్దపెద్ద అంగలతో యింటికి చేరాడు. శారద అప్పటికి వాకిట్లోంచి లేచివెళ్లి యింట్లో కలతగాపడుకొనివుంది. వీధివాకిలి తలుపులు తెరచుకొనేవున్నాయి. సన్నగా లాంతరు మసక వెల్తుర్ని చిమ్ముతోంది. సుడిసి, సుడిసి వీచేగాలికి, గోడకి తగిలించిన సెక్కు క్యాలండర్లు, వుద్రేకంతో టపాటపా మంటూ కొట్టుకొంటున్నాయి. శారద వాలు జడలోని మల్లెపూలు ఆ యింటంతటిని వాసనతో నింపివేస్తున్నయి. వెన్నెలరాత్రి కాదు. వీరభద్రం ఎంతో మెచ్చుకొంటూ, తెరచిన తలుపులగుండా నిర్భయంగా లోనికి ప్రవేశించి, చప్పుడు కాకుండా గడియవేశాడు. అయినా రవ్వంత చప్పుడు కాక తప్పలేదు. శారద తలెత్తిచూసింది. ఒక నల్లని నీడ రెండు గుమ్మాలకవతల, మధ్యంగా, నిటారుగా నిలబడివుంది లాంతరు కాంతి, ఘరితీసిన శిరస్సును చెక్కే రహస్యంలాగ వుంది. భయంవేయలేదు. కాని అనుమానంవేసింది. నారాయణరావు అయితే అక్కడెందుకు ఆగిపోతాడు? సరాసరి తనని పిలుస్తూ, దగ్గరకే వచ్చేసేవాడుగ! కాదు తనభర్త కానేకాదు ... మరెవరు? పరాయివాడికి, తనింట్లోకొచ్చేంత ధైర్యముందా? బ్రతికటూసికేనా; వీరభద్రమా! కాదేమో."

"ఎవరామనిషి?" వీరభద్రం పల్కలేదు. కదిలాడు "ఎవరంటుంటే!" శారద ముందుకొచ్చింది. మల్లెపూలవాసనలు, వీరభద్రంని మత్తెక్కించినయి. రాను కొన్న సెంటు వాసనలు గుమ్మనిపించినయి. ముస్తాబు యావత్తూ మధురకోర్కెల్ని లేపినయి. వీరభద్రం దగ్గరగా వచ్చాడు. శారద కాస్త వెనక్కితగ్గింది. యిద్దరూ ఆయింటి మధ్యలోవున్నారు. కటికచీకటి. శారద గుర్తుపట్టింది. తన వియుక్తాలోచనలు పటపటా తెగినయి బిత్తరపోయింది."

"నువ్వా!" — నాలిక పెగల్లేదు. వీరభద్రం యికిలిస్తూ "నన్ను వెళ్లి పడుకోమన్నాడు". అన్నాడు. కళ్లుపొరలు గమ్మినయి నోరు సిగరెట్లతో కంపుకొడుతోంది.

"ఎవరు?"

"అన్నగారు"

"నోర్మూయ్!" శారదకంత ధైర్యం ఎలా వచ్చిందో!

వీరభద్రం కొంచెంజంకాడు. బలంపోయింది

"బుద్ధిలేదూ! ఒంటరిగా వున్నావని సాహసిద్దామనుకున్నావేం. పైగా ఆయన వెళ్ళిపడుకోమన్నారని అసభ్యంగా ప్రవర్తిస్తున్నావా? పిచ్చి పిచ్చిగా మాట్లాడావంటే మర్యాదక్కడదు. యిదివరకూ కూడా యిలాగే చేయాలని చూశావు బంధువుడివికదా! అని దయ తల్చాను. లేకపోతే నీగతి ఏమయ్యేదో తెలిసివుండేది. ఆయనగారితో గనుక నువ్విట్లా చేస్తున్నావని చెప్పానంటే, నున్నంలోకి ఎముక లేకుండా తంతారు... దిక్కులేనివాడివై వచ్చావని ఆశ్రయమిస్తే యిదా నువ్వుచేసేది. సిగ్గులేదూ!" చెడామడా తిట్టేసింది. వీరభద్రం ఓడిపోయాడు ... కొంచెం సంబాళించుకొని. "ఇక యిప్పుడు గాదు సమయం... యీ సారి పట్టుపట్టి చూడాలి" - అని వెంటనే వెనుకతిరిగి పోబోయాడు ... ... శారద అతని ముందుగా వెళ్లి చిన్నగావున్న లాంతరు సెక్కించింది. వీరభద్రం తలవంచుకొని, తనగదిలోకి వెళ్ళబోతుండగా

"భోంచేద్దువుగాని రా ..." అని మునుపటిలాగే అంది. అతనికి క్రోధం నిలువెల్లా దహిస్తోంది. రానంటామనుకున్నాడు. కాని కథ అడ్డం తిరుగుతుందేమోనని, సరేనంటూ బట్టలుమార్చుకొచ్చాడు. శారద వాకిలి తలుపులు తెరచి, వంటింట్లోకి వెళ్ళింది. వీరభద్రం ఆ రాత్రి ఎంతో సిగ్గుపడినవాడిలా ముఖం పెట్టుకొని, నంగనాచిలా, పెట్టిన కూటిని, నోట్లో కుక్కుకుంటూ తిన్నాడు. ఇంకా నారాయణరావు రాలేదు. జరిగిన యీ సారి తతంగం, శారద, నారాయణరావుతో ఎక్కడ చెబుతుందోనని భీతి చెంది, చేయి కడుక్కున్న వెంటనే, చెప్పులు తొడుక్కొని గుమ్మం దాటాడు. "ఎక్కడికి?" శారద కంచం కడుగుతూ అనుకుంది.

పీర్ల పంజాలోని ఆటగాళ్ళు, సురకోయ్యలు వాలగానే లేచారు. నారాయణరావు చేతులు దులుపుకొని జేబులు చూసుకొన్నాడు. పెట్టుబడి తాలూకు అయిదువందలూ పోయినయి. వచ్చిన లాభం వెయ్యీ దూసుకొనిపోయి, పైపెచ్చు (అప్పుగా) చే బదులు అడిగి పుచ్చుకొన్న డబ్బూ పోయింది. అంతకలిస్తే దాదాపు రెండువేలు ఆ రాత్రి జూదంలో హారతి కర్పూరంలాగా హరించుకొనిపోయింది. వీరభద్రం లేకపోబట్టే యింతపని జరిగిందని దృఢంగా నమ్మాడు. ముఖమంతా జిడ్డుగారుతోంది. తలచెరిగింది. కట్టుకున్న గుడ్డలు సిగరెట్లపొడితో మరకలైనయి. యింటిదారి పట్టాడు. అప్పిచ్చినవాడు కొంతదూరంవచ్చి, నారాయణరావుతో,

"నా బాకీ ఎప్పుడు సర్దుతారు?" - అని అడిగాడు.

"ఒక వారంలో సర్దుతాలే" అని అతణ్ణి పంపించి, సిగరెట్టు కాల్చుకొంటూ యింటికొస్తూండగా - ఆ చీకట్లో, వీరభద్రం ఎదురుగావచ్చి, మొసలి కన్నీరు కారుస్తూ-

"నువ్వులేకపోబట్టే, యివాళ నేనిన్నిమాటలు పడాల్సొచ్చింది." - నారాయణరావుకి అర్థం కాకుండా అన్నాడు, డబ్బుపోయి అతను చిరాగ్గా వుంటే, యింకా విసిగిస్తూ అర్థంకానట్లు చెప్పచూస్తున్నాడు వీరభద్రం.

"ఎవరోయ్ నిన్నన్నది" అన్నాడు,

"వదినగారు."

"శారదా!"

"అవును."

"ఏమంది?"

"అనవలసినవన్నీ అంది. నువ్వెళ్లి పడుకోమన్నావా లేదా."

"ఒంటరిగా వుంటుంది గదా! భయంవేస్తుందేమో! కాస్త తోడుగా పడుకోమని చెప్పాను."

"పడుకుందామనే వెళ్ళాను, అసభ్యంగా మాట్లాడింది" వీరభద్రం, కాలుస్తున్న సిగరెట్ని విసిరి అవతల పారేశాడు. ఎంతో అవమానపడిన వాడి

లాగా తర్వాత మాట్లాడాడు. నారాయణరావు కోపం తెప్పించాడు. లోగడవరకూ వీరభద్రం, నారాయణరావుని 'అండీ' అంటూవుండేవాడు. చనువు ఎక్కువైపోవటంతో, 'నువ్వు' అనే వరకూ వచ్చింది. కాలం గతి అలాంటిది!! వీరభద్రం మాటలతో నారాయణరావు వుగ్రుడయ్యాడు అతని మాటల్ని పూర్తిగా నమ్మాడు. సరాసరి యింటికొచ్చాడు. శారద, భర్తకోసం పక్కదులిపి కాస్తోంది.

ఏసమయానికి ఏమవుతుందో ఎవరికి తెలుసు! వచ్చీరావటంతోనే, శారదను పిల్చాడు. ఆ పిలుపులో ఎంతో కఠోరతవుంది. శారద గజగజలాడింది. ఇంతకాలం గడిచినా, తన కాపురంలో, నారాయణరావు అలా పిలవటం శారద వినలేదు. మెల్లిగా వచ్చి దగ్గరగా నుంచుంది. కళ్లెర్రజేసి చూశాడు. ఆమె తెల్లబోతోంది. క్షణంలో శారద చెంపచెళ్లుమంది. కళ్లు చెమ్మగిల్లినయి. మళ్ళా కొట్టాడు. అయిదువ్రేళ్లూ తేలినయి. కందిపోయింది. వీపు పగిలింది. బిగుతుగావున్న జాకెట్టు పిగిలింది. డొక్కలో తన్నాడు. పెట్టుకున్నచీర కుచ్చెళ్లు వదులైజారి, పాదాలపైపడ్డాయి. వాలుజడకొన వూడిపోయింది. రొప్పొచ్చేంతవరకూ కొట్టాడు. ఆమె స్పృహతప్పిపడిపోయింది. అన్నెం పుణ్యం తెలుసుకోకుండా చావబాదాడు. న్యాయమెవరిదో విచారించలేకపోయాడు. ఎవరిది తప్పో అడక్కుండానే చేయిచేసుకొన్నాడు. అంతటికోపం నారాయణరావులో దాగివుందని, శారదకు స్పృహతప్పి పడిపోయేంతవరకూ తెలియనే తెలియదు. మెల్లిగా వెనకవతలేవున్న వీరభద్రం కదిలి ముందుకొచ్చి –

"ఏదో మందలిస్తాననుకున్నానుగానీ, యిట్లా చావబాదుతావనుకోలేదు. నిలువునా ప్రాణాలు తీసేటట్లు వున్నావు. . . యిక చాల్లేపద. ఎవరైనా నిద్రలేచినట్లయితే, నగుపాటుపాలవుతాం.." అంటూ అప్పుడు నోరు మెదిపాడు. అంతవరకూ వూరుకునే వున్నాడు. నారాయణరావు తరువాత, శారదవంకైనా చూడకుండా దొడ్డివాకిట్లోకి వెళ్లాడు. వీరభద్రం, పడిపోయిన శారద ముఖంమీద యిన్ని నీళ్లుచల్లి, గొంతుకలో కాసిని మంచినీళ్లు పోసాడు. కాస్తాగిన పిదప శారద కదిలింది. కానీ లేవలేకపోయింది. ఆమెలో శక్తి నశించింది. అతికష్టంమీద లేచిందిగానీ, మళ్ళా అంతలోనే దబాల్న పడింది. వెంటనే వీరభద్రం, ఆమెను ఎత్తుకొని, తీసికెళ్లి, పక్కదులిపివేసిన మంచంమీద పడుకోబెట్టాడు. ఆమెకేమీ తెలియని స్థితిగావుంది. ఒళ్లంతా నొప్పిగావుంది. మూల్గుతోంది. వీరభద్రం, ఎంత కిరాతుడుకాకపోతే, నారాయణరావుకి అలా పుల్లింగాలు ఎక్కించి యింతపని చేస్తాడూ! శారదని, భర్తకి తెలియకుండాతాకి, పడుకోబెట్టినందుకు, గర్వంగా వుపకారిలాగా ప్రవర్తిస్తాడూ! కొరివితో తల గోక్కున్నట్లవుతోంది నారాయణరావుకి. యీ విషయం అతనికేమీ తెలియటంలేదు. నారాయణరావు పూర్తిగా చెడటమేగాకుండా, శారదనికూడా నానా హింసలూ పెడుతున్నాడని అటూ జగన్నాధానికీ తెలిసింది, యిటు శారద తల్లిదండ్రులికీ అన్నదమ్ములికీ తెలిసింది. వూరినిండా అప్పులు పెరిగిపోయినయ్యని. వున్న నిల్వధనం చేతులారా ధ్వంసమైందని, నారాయణరావు తలెత్తుకోకుండా, ఎవ్వరికీ కనబడకుండా తిరుగాడుతూ వున్నాడు. ఇంతలో దస్తువసూలు తరుణం వచ్చింది. వీరభద్రం, స్కూలు పిల్లల్ని సరిగా చూడటంలేదని పుకార్లు లేచినయి. హైస్కూలులో చేరవలసిన పిల్లకాయలు సరిగా చదవక, వీధుల వెంట గోడుం బిళ్లలాడుకొంటూ చరిస్తున్నారు. దమ్మిడీ అప్పు, నారాయణరావు ఎంత బ్రతిమలాడుకొన్నా పుట్టడంలేదు. లోగడ యిచ్చిన అప్పులవాళ్ళు నారాయణరావుని, కనబడితే పీక్కు తింటున్నారు. వీళ్ళని తప్పుకోవటంకోసం, వీరభద్రం దయవల్ల అబద్దాలాడటం బాగా నేర్చుకొన్నాడు. అదిగో . యిదిగో అని రోజులు దాటవేయటం అలవర్చుకొన్నాడు. ఏంచేయటమో! తోచలేదు . . వీరభద్రంచేత మునసబుగిరి అడపా . తడపా చేయి

స్తూనే, కేవలం సంతకాలు మాత్రం పెడుతూ వున్నాడు దస్తువసూళ్ళ డబ్బు, వసూలు చేసినట్లే చేసి, తాలూకాఫీసులో కడదామనుకొంటూనే, పీర్ల పంజాలోకి కాలుపెట్టాడు ఒకనాడు. ఆ రోజున, చుట్టుప్రక్కల వూళ్ళ ఆటగాళ్ళుకూడా వచ్చారు. వీరభద్రం రెచ్చగొట్టాడు. నారాయణరావు రెచ్చిపోయాడు. వసూలైన పైకాన్ని ఇనప్పెట్టెలోంచి రెండు చేతుల్లో తీశాడు. శారద చూసింది. గుండెలు బాదుకుంటూవచ్చి, గోడు గోడున ఏడుస్తూ, "తీసుకొని వెళ్ళవద్దని" కాళ్ళుపట్టుకొని అడ్డుతగిలింది. నారాయణరావు లెఖచెయ్యలేదు. ఆమె బ్రతిమిలాడుతోంది. అతను కాళ్ళని లాక్కోడానికి పెనగులాడుతున్నాడు. అవతల పీర్లపంజా పిలుస్తోంది. యివతల శారద అడ్డగిస్తోంది. వీరభద్రం మాటలు చెవుల్లో గింగురుమంటున్నయి. నారాయణరావు త్వరపడుతున్నాడు. శారద, అతని పాదల్ని వాడేసుకొని,

"యింతకాలమూ, మన డబ్బు పోయినా నేనేమీ అనుకోలేదు. అప్పులు పెరిగి, మనమర్యాదనీ, కుటుంబగౌరవాన్నీ, వంశక్షేమాన్నీ నాశనం చేస్తున్నా నేనేమీ మిమ్మల్ని కాదనలేదు. యీ డబ్బుమనది కాదు. ప్రజలది. రైతులిది. ఎన్నోకష్టాలుపడి, వాళ్లు సర్కారు వారికి యిచ్చుకొన్నారు. దీన్ని మీరు స్వార్థంకోసం, స్వలాభంకోసం, విలాసాలలో తగలేస్తే, జైలుకు వెళ్లాల్సొస్తుంది. యీ పనితగదు. వూరుకోండి. మానుకోండి" గగ్గోలుగా అంటోంది. అతను వినిపించుకోలేదు ... విసుక్కున్నాడు. తిట్టాడు. కొట్టాడు. ఆమె పట్టువిడువలేదు. మళ్ళీ డొక్కలోతన్నాడు. అవ్వళించింది. ఆమె చేతులు అతని పాదాన్ని వదిలేసినయి. వడివడిగా, నారాయణరావు పీర్ల పంజావేపుకి నడిచాడు. అప్పటికే ఆటమొదలైంది. 'మునసబుగదా' అని ఆలస్యమైనా కూర్చొనున్నారు. నారాయణరావు వీరభద్రం ప్రోత్సాహంతో కూర్చున్నాడు.—

పేకా పేమిలంతా ఆడుతున్నారు. సిగరెట్లు, నాలికలు మంటలెక్కేంతవరకూ కాల్చారు. ప్రొద్దు పోతున్నకొద్దీ డబ్బు తరిగిపోతోంది. ముఖాలుపీక్కుపోతున్నాయి. ఆసలు వోపికనశించి పోతోంది. డబ్బుమీదవుండే దాహంకొద్దీ, అలాగే ఆడుతున్నారు. తెల్లారేసరికి, నారాయణరావు, వీరభద్రం చలవవల్ల దివాలాతీసాడు. వూరిముఖం చూడటానికి, సిగ్గు - లజ్జాభిమానాలవల్ల చెల్లలేదు. యింటికి రావటం యిష్టంలేక, సరాసరి అటుంచి అటే, బయలుదేరి. అన్నగారి వద్దకు వెళ్ళాడు. జగన్నాధం వచ్చిన తమ్ముణ్ణిచూసి నిర్ఘాంత పోయాడు, అవుసరమేమిటని ప్రశ్నించాడు. దుర్గమ్మ పల్కరించలేదు. ధర్మారావు హీనంగా చూశాడు జయలక్ష్మి మంచినీళ్ళిచ్చింది. కుశల ప్రశ్నలడిగింది. ఏమిటోగా చెప్పాడు.

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(డిసెంబరు సంచిక తరువాయి)

౧౫

కౌసల్యానేత్ర వికాసంబుఁ జేకూర్చు
 రక్తాబ్జనేత్ర! శ్రీరామచంద్ర!
రావణ సంహార! రఘుపతీ! రఘువరా!
 క్షేమశాయి! ముకుంద! శ్రీశుభాంగ!
అవనిజ కుచకుంకు మాంకిత సద్వక్ష!
 మాయా మనుజదేహ! మా ప్రియుండ!
శ్రీ విష్ణురూపుఁడై - సీతతోఁగూడిన

 శ్రీ రఘునాథ! వరద! శ్రీ రామభద్ర!
నిర్మలాకార! శుభకరా! నిగమవేద్య!
భక్తజన పారిజాతమా! పరమపురుష!
నిన్ను సేవింతు భజియింతు; సన్నుతాంగ!
నన్ను రక్షింపవయ్యా! సంపన్నచరిత!

౧౬

కాంచనాంబరధారి! కమనీయమా, ఇంద్ర
 నీలకాంతి శరీర! నీరజాక్ష!
వధురాక్షసుని నేలమట్టంబు కావించి
 స్తుత్య చరిత్రుఁడౌ - సుందరాంగ!
వానరవరులు, విశ్వామిత్ర, శ్రీ వశి
 ష్ఠాది మునిగణంబు - మోదమలర
నీ సేవ సతతంబు - నెఱపుచునున్నారు
 సీతా సమేతుఁడౌ - శ్రీ శుభాంగ!
కోటి భాస్కర చంద్రుల మేటి తేజ!
నీవు పీఠాసనమునందు నెగడి, భక్త
జనుల రక్షించుచున్నావు సరసిజాక్ష!
నన్ను రక్షింపు శ్రీరామ! నాగశయన!

౧౭

వింజామరలబూని - వేడ్క శత్రుఘ్నుండు
 భరతుండు నీ సేవఁ బరగసల్ప
శ్వేతాతపత్రంబుఁ బ్రియమున లక్ష్మణ
 స్వామిపట్టియు సేవ సల్పుచుండ
కల్పవృక్షముక్రింద - కమనీయమైనట్టి
 మణిపీఠమందు, సంబరము మెఱయ
నాసీనుఁడైనట్టి - యబ్జాస్య! శ్రీరామ!
 ముని జనార్చిత పాదవనజ యుగళ!
సీతతోఁ గూడి యున్నట్టి శ్రీ శుభాంగ!
రఘుపతీ! రామచంద్ర! గారవముతోడ
నిన్ను సేవింతు, భజియింతు; నిర్మలాత్మ!
నన్ను రక్షింపుమయ్యా సంపన్నచరిత!

౧౮

నరులు, రాక్షసులు వానరులు [illegible] సేవింత్రు
 ఇంద్రాది దేవతల్ యెపుడు నీదు

పాదపద్మంబులు - భక్తితో పూజింతు
శ్రీరామ! రఘుపతీ! శ్రీనివాస!
పరితప్త కాంచన ప్రభతోడఁ దుల్యమౌ
మేనిఛాయనుగల్గు జానకాంబ
వామాంకమందు, సంవాసంబు సేయంగ
నామె నాలోకించు చనవరతము

ఛత్రచామరములను హస్తమునఁదాల్చి
లక్ష్మణుఁడు నిన్ను సేవింప లలితభంగి
ముద్దుమోహన మూర్తివై మురిసినావు;
రామ! నీ సేవ లొనరింతు; రక్తితోడ

౨౯

కస్తూరి బొట్టుచేఁ గమనీయమైనాడు
వాలిని మర్దించి ప్రబలినాడు
కరుణా సముద్రుఁడై, కమలాస్యకమల, మ
ధుపమై వెలసిన సంతోషకరుఁడు
కల్యాణ సంపత్తిఁ గల్గఁజేసెడువాఁడు
కౌసల్యకును, ముద్దుగల్గువాఁడు
సుగ్రీవు రక్షించి - శుభము గూర్చినవాఁడు
ఘనపరాక్రమముతోఁ దనరువాఁడు

అర్కకోటి సదృశుఁడౌ జానుబాహుండు
సీతతోడఁగూడి చెలఁగువాఁడు
కాంచనాంబరములఁ గొమరరూపుఁడౌ
రాముఁ దలఁతు సతము నేమముగను.

౩౦

కోటి దివాకరుల్ - కోటి విద్యుల్లతల్
నీ కాంతి సరిరావు నిగమవేద్య!
కౌస్తుభాలంకార! కైలాసవాస ప్రి
యా! సనకాది సంయమిగణంబు
పరివృతులై, నీదు పాదపద్మంబుల
సేవించుచున్నారు శ్రీవిలాస!
ముత్తెముల్ రత్నముల్ బొదివినట్టి, కిరీట
కుండలధారివై - కువలయేశ!

రామచంద్ర! గ్రైవేయ హారములతోడ
వెలయుచున్నావు, వైదేహి నీకెపుడు
నామె కుచకుంకుమాంకితం బందినావు;
రామ! నీ సేవ సల్పెద - రక్షకొఱకు.

౩౧

అంగద సుగ్రీవ హనుమదాదులు, నిన్ను
సేవించుచున్నారు: శ్రీరమేశ!
బ్రహ్మ, శంకరుఁడు దేవతలు నిన్ సతతంబు
వినుతించుచున్నారు వేదవేద్య!
కల్పవృక్షముక్రిందఁ గమనీయ మాణిక్య
సింహాసనస్థుఁడౌ - చిద్విలాస!
గుణనిధి రఘువీర! కోటి విద్యుత్కాంతి
సదృశ శరీర! విచారధీర!

రామ! తేజస్స్వరూపుఁడై - ప్రబలినావు;
రూఢిగాఁ జూడఁ బరమేశ్వరుఁడవు నీవ!
సీతతోఁ గూడియున్నట్టి శ్రీ శుభాంగ!
సేవలొనరింతు; నన్ను రక్షింపుమయ్య!

(సశేషము)



ఎగువచిత్రం: — దేశంలో శిశు సంక్షేమ కార్యకలాపాలలో పెద్ద ఆసుపత్రులన్నిటిలోను శిశువుల వార్డులను ఏర్పాటు చేయడానికి కృషి జరుగుతోంది, ఇది న్యూఢిల్లీలోని ఒక ఆస్పత్రిలోని శిశువులవార్డు.

దిగువచిత్రం: — పిల్లల విజ్ఞాన వినోదాలకొరకు ఆకాశవాణి ప్రత్యేక కార్యక్రమాలను ప్రసారముచేస్తున్న దృశ్యం.

# నమ్మకములు - దృష్టిదోషము

శ్రీమతి నెమలి చంద్రమతి

పలువిధములైన నమ్మకములలో దృష్టిదోషము ఒకటి. "ఎందుకోనమ్మా పిల్లడు అలాపోరు పెట్టి ఏడుస్తున్నాడు కాస్త ఉప్పున్నా చుట్టివేసెయమ్మా! ఎవరి దృష్టిపడిందో," అని మన అమ్మమ్మలుగాని, అమ్మగాని, మనమేగాని అంటూ వుంటాము - కొందరికండ్లు అలాటివి, దృష్టి తగులు తుందంటారు. ఒకరికండ్లేమిటిలెండి, తల్లి కండ్లు దయ్యపు కండ్లని వాడుకమాటకూడ ఒకటి కలదు.

అమితమైన ఆశాపాశంతో తల్లి బిడ్డనుచూచి పొంగిపోయిన, వెంటనే, ఏదో ఒక నలతగాని క్రింద పడటంగాని, చిక్కి పోవుటగాని సంభవించును. దృష్టితగులట మేమిటి, అదేమిటి ఇదేమిటి ఇవన్నీ నమ్మతారా. పిచ్చినమ్మకాలు, మునుపటివారైన నమ్మతారు వాటిలో ఏముందని అంటారు కొందరు. కాని ఆలోచించి చూచిన అందులోను కారణంలేక పోదు. విజ్ఞానశాస్త్రజ్ఞులు, మనస్తత్వవేత్తలు పరిశోధించి, తెలుసుకొనుచున్నారు. మనదృష్టికి ఆకర్షణ శక్తి, విద్యుత్ శక్తివలె ఒక శక్తివున్నదని వారు చెప్పుచున్నారు. మెస్మరిసమ్, హిప్నటిసమ్ ఇవికూడ దీనికి సంబంధించినవే.

అమితమైన ఈర్ష్యగానీ, అమితమైన ప్రేమగాని ఒక శక్తిని ఉద్రేకించి, ఎదుటివ్యక్తిపై తదేకదృష్టిగాచూచిన, ఆవ్యక్తినుండికొంత ప్రాణశక్తినిలాగి వేయుచున్నది. అప్పుడాయెదుటి వ్యక్తి తికమకలాడు చుండును. మనము ఎవరినైన, ఏ వస్తువునైన ఎంత బాగున్నదో అని అంటున్నప్పుడు పెద్దవారు అదుగో నీకాల్లో నెత్తురుకారుతున్నది చూచుకో అనెదరు, ఎందుకు! మనదృష్టిని మనసును ఆవ్యక్తినుండిగాని ఆ వస్తువునుండిగాని లాగివేయుటకే. అలాగనిన వెంటనే, ఏమిటా అని అదిరిపడి చూచెదము.

తల్లికి తన బిడ్డమీద ప్రేమేగాని, ఈర్ష్యవుండదు కదా, ఆ తల్లిప్రేమ బిడ్డకు చెడుపుచేయునా అని అనుకొనెదరు. అపరిమితమైన ప్రేమతో చూచి చూచి ఆ బిడ్డ శక్తినికాస్త తనకు తెలీకుండగనే తనలోనికి లాగివేయుచున్నది తల్లి. 'కొందరు అమ్మా నా కండ్లతో సరిగానైనా చూడనమ్మ; గట్టిగాచూస్తే ఎక్కడ దృష్టితగులుతుందో! ఎక్కడైనా ఎలాగైనా బ్రతికిబాగుండిన చాలు నమ్మా' అని కొందరంటూ వుంటారు. ఒక కంటితోచూచి చూడనట్లు వుంటేనే బిడ్డలు ఆనెదరు. అమితమైన ఆశ పెట్టుకొనివున్న దాన్నే మన దగ్గరనుండి లాగి వేయుచుండును, భగవంతుడు. అది యొక పరిక్ష.

ఒక మనష్యులకేకాదు దృష్టి తగలటం, పశువులకు చెట్లకు జీవములేని ఇండ్లకు చిత్రములకు అన్నిటికిని తగులునెదరు. తోటలో మొక్కలుగాని పాదులుగాని బాగా పెరుగుచున్నపుడు ఒకరి దృష్టిపడకుండ ఒక కుండకు సున్నంపూసి, బొగ్గుతో చుక్కలు పెట్టి ఒక కొయ్యకు తగిలించెదరు. పొలాల్లో చేలల్లో కూడా వికృతాకారంగల మనిషి బొమ్మను చేసి తగిలించెదరు - ఇండ్లు కట్టేముందు గుమ్మడికాయకు మనిషి తలవలె బొమ్మ గీచి వీధి గుమ్మమునకు వ్రేలకట్టెదరు.

మనలో చిన్నబిడ్డలకు బుగ్గమీదనో గడ్డంమీదనో నల్లటి దృష్టి చుక్కపెట్టటం, మెళ్ళోగాని మొల్లోగాని, చేతికిగాని నల్లపూసలు కట్టడం నల్లగాజులు తొడగటం అలవాటు వున్నది. దృష్టిమంత్రం వేయటం, ఉప్పుచుట్టి నిప్పులోనో నీళ్ళలోనో వేయుదురు. చీపురుపుల్లలు వెలిగించి వాటితో చుట్టి దృష్టితీసెదరు. ఎర్రనీళ్లు అంటె పసుపు సున్నం కలిపిన హారతినీళ్లు చుట్టివేయుదురు. కొబ్బరికాయ

దిగదుడిచి కొట్టెదరు. ఇంకా కుండ దృష్టి అని ఎర్ర అన్నం కలిపి దృష్టి ఇలాటి వెన్నో, వున్నవి,

పెండ్లిళ్లలోనే గాని ఇంకనూ ఏ శుభకార్యమందు గాని. ఆఖరున హారతితీయకుండా వుండరుకదా. ఈ మంగళహారతియు దృష్టిపరిహారమే!

యశోద జగత్కారకుడైన ఆ శ్రీ కృష్ణునికే, పుత్రవ్యామోహముచే, దృష్టితగులునని బండిని పడద్రోసినపుడు, పూతనను సంహరించినపుడు మద్దిచెట్లను కూల్చినపుడు ఇంకను ఇలాటి సందర్భముల్లో కొడుకునకు దృష్టి తీసివేసినట్లు, భాగవతమునందున్నది. ఇకమనందాన్ని పాటించటం ఆశ్చర్యకరము కాదు. అనాదినుండి ఈ పద్ధతి వచ్చుచున్నదని మనకు తెలియుచున్నది.

చంటి బిడ్డలకు మూడు నెలలవఱకు ప్రతిరోజూ దృష్టితీసెదరు. కర్పూరం వెలిగించి దృష్టి తీయటం క్రిమి సంహారం అంటు వ్యాధులను దగ్గరకు రానీయదు. పసుపు సున్నంకూడ అలాటివె. బుగ్గమీద నల్లటి చుక్క ముఖం చూడగానె మనదృష్టికి కనబడును. అదృష్టిశక్తియొక్క తీవ్రత తగ్గిపోవును. ఎవరైనను భుజించునప్పుడు మరియొకరు వెళ్ళి ఎదురుగ కూర్చుని, తింటున్నవారిని చూచుచుండిన వారి నోట్లోనికి ముద్దదిగదు. క్రిందనైనా పడిపోవును లేక పొరపోయి తికమకలాడెదరు — అందువలననే భోజనం చేయునపుడు పైవారెవ్వరు చూడకూడదనెదరు. అలా ఎవరైన వచ్చినను వారికికూడ కొంచెము పెట్టనిదే తాముతినరు. రుచిచూడమని, పంక్తిని కూర్చుండమని చెప్పెదరు. పసిబిడ్డలకు అందరి ముందర పాలుపట్టవద్దనుటకు ఇదే కారణం.

ఏమో మనుష్యుల్లో ఎన్నిశక్తులున్నవో ఎవరి కెరుకని ఇప్పుడిప్పుడు కదా అన్నియు పరిశోధించుచున్నారు.

పాశ్చాత్యులుకూడా దీనిని పాటించెదరు (ఈవిల్ అయిస్) అనెదరు. వాళ్ళలోను కొందరు నమ్మెదరు కొందరు నమ్మరు. వారు ఏదైనను బాగున్నదని గాని, బిడ్డ బాగున్నాడని కాని అన్నపుడు వెంటనే (టచ్ వుడ్) అని కొయ్యను తాకెదరు. అదిదేనికో!

దృష్టిలో దోష దృష్టి ఎట్లున్నదో మంచి దృష్టి కూడ అట్లే వుండును. ఒక్కొక్క మహానుభావుని దృష్టి మనమీద పడినట్లయిన, మన చెడుతలంపులు, ఆలోచనలు, అనుమానములు అన్నియు పటాపంచలగును. అటువంటివారి (కటాక్షం) మనకు కలుగవలెను. 'కటాక్షవీక్షణము' అనిన అర్థమేమిటి? 'కడగంటిచూపు' 'ఆ కడగంటి చూపులోనెవున్నది అంత మహాత్యం' భగవంతుడా! కటాక్షించు అను మొఱ పెట్టెదము.

కండ్లనుండి వెలువడు చూపులో ఎదుటి వ్యక్తినే మార్చేయగలరు. మాడ్చేయగలరు కూడ! దుర్గుణములు గలవ్యక్తిని, నిలువునా దహించి, సుగుణములు మొలకలెత్తింప చేయుదురు - శివుడు మూడోకన్ను తెఱచినాడనిన అర్థమిదియే - మహాయోగులు జ్ఞాననేత్రం తెఱచి పాపులను పరిహరించటమన్నమాట. అటువంటి మహాజ్ఞానులు శివస్వరూపులే

ఇటువంటి నమ్మకములు నమ్మటమా నమ్మక పోవటమా అనిన, ఎవరెవరి అంతరాత్మలకు నిజమని తోచిన నమ్మెదరు. అన్నిటికి అనుభవం అవసరం. పూర్వపు శాస్త్రవిధులన్నిటికి, ఆలోచించిచూచిన, ఒక కారణం దొఱకకపోదు. ఆ కారణం తెలిసిన గాని ఇప్పటి వారు నమ్మరు. దేవుడన్ననే అనుభవం లేనిది నమ్మమనెదరు.

వారికి దైవంమీద నమ్మకం ఎన్నిపుస్తకములు చదివినను వచ్చునది కాదు. ఎంతచదువు చదివినను వచ్చునదికాదు. వారి వారి పూర్వజన్మవాసన కొద్దీ వారికి స్వయంగానో. గురుమూలకంగానో, సంప్రాప్తమగును. మనోభావనచేతగానీ, మనకండ్లచే చూడలేము. చెవులతోటి వినలేము. జ్ఞాననేత్రముచే తెలుసుకొనవలసినదే.

మనుష్యులకు పలురకములైన నమ్మకములుండును. దేనిమీదను నమ్మకమనునది లేకుండ మానవులు

బ్రతకలేరు. కాని అతిగా ఇటువంటినమ్మకములు, దృష్టి తగలటమని, శకునములని, స్వప్నములని ఇత్యాదుల మీద ఎక్కువగ నమ్మకం పెట్టుకొనక, దానికి కారణం తెలుసుకొని తగినట్లుగా ప్రవర్తించటం ముఖ్యం. అన్నిటికిని మన మనస్సే కారణంగనుక మనం ఎక్కువ వాటిని గురించి ఆలోచన పెట్టుకొనిన అవేదనలను బాధించును. ముఖ్యముగ దైవనమ్మకమొకటియున్న ఎటువంటి దుశ్శకునములు వచ్చినను కనబడినను, దాని ఫలము కలుగదు. దృష్టిదోషముని గాని మంచి శకునములుగాని, దుశ్శకునములుగాని ఏది వచ్చినను, కలవరపడక నిశ్చలమైన, దృఢమైన మనసుతో నుండటమే మనవిధి.

సూర్యోదయమయిన వెంటనే, నక్షత్రములు కనపడనట్లు, నిశ్చంచలమయిన భగవద్విశ్వాసము కలిగిన వెంటనే నక్షత్రముల వెడి చిన్న చిన్న నమ్మకము లన్నియు తొలగును.

---

# దొరికినట్లే నాకు — ధర్మప్రభువా నీవు!

"శైలజ"

—x—

ఎవరో నాకు నీ - వెరుగ జెప్పుటకన్న
తెలుసుకొందును వేరు - సూత్రాలవలన
రేయిపగలును నీదు - కల్పనలు కావా
గాలి విసురుకు నీవు - కారణము కావా
మింటిపై వెలిగేటి - వింత దీపములు
నీ యానపైననే - నడయాడలేదా !

గగనంబు భువిగలుపు - హరివిల్లు నీవు
వింత రంగులతోను - విడువంగలేద ?
అన్నిటికి ముఖ్యమై - అలరారుచుండు
మానవుని సృష్టికే - మదిపొంగుచుండు
యింత కన్నను రుజువు - లెక్కడనుకలవు
దొరికినట్లే నాకు - ధర్మ ప్రభువా నీవు !!

# స్త్రీలు — పశుపోషణ

శ్రీ యేజెళ్ల రామకృష్ణ

—(౦)—

పాలు, నెయ్యి, వెన్న, మజ్జిగ, మీగడ మున్నగునవి శాకాహారులకు చాలముఖ్యం. పల్లెటూళ్లలోను, పట్టణములలోను ఈ పరిశ్రమనుగూర్చి స్త్రీలు చాల శ్రద్ధ చూపుతారని ఆశించుతాం. పశువులు సాధు జంతువులు. పెంచుట చాల సులభం. అందువలన రైతు సోదరులు పొలము పోయినపుడు వారి స్త్రీలు ఈ జంతువుల విషయమై చాల జాగ్రత్త తీసుకోవాలి. సామాన్య వ్యవసాయంతోబాటు ప్రతి స్త్రీ కొన్ని పశువులను పెంచుట లాభదాయకం. స్త్రీలు పాడి పశువులను చాల జాగ్రత్తతో మేపి పాడి పరిశ్రమను అభివృద్ధిచేసి దేశాన్ని సస్యశ్యామలం చేయాలి.

రోజు వారు పాడి పశువులపాలు తీయునపుడు తమ చేతులను, పాలు పిండు పాత్రలు, ఆ పశువు పొదుగును శుభ్రంగా కడగాలి. లేకపోయిన అంటురోగములు కల్గించు సూక్ష్మ జీవులు వాటిలోనుండి మనకు అనారోగ్యమును కల్గించి పాలను విరుగునట్లు చేస్తాయి. పాలు దూడలకు ఎక్కువ తక్కువలుగ వదలక నియమంగ వదలాలి. లేకపోయిన వాటికి జబ్బులు వచ్చి చనిపోతాయి. పశుశాలను, పాలు తీయువారి గుడ్డలనుగూడ చాల జాగ్రత్తగా నుంచుకోవాలి. పశుశాలలోని పశువుల, మల మూత్రాదులను శుభ్రం చేసిన తర్వాత పాలను తీయాలి. పశువుని శుభ్రంగా కడిగిన తర్వాత పాలను పిండాలి. పాలు పిండుచోట్ల పేడ కుప్పలు, మురుగు కాలవలు ఉండరాదు. పాలు పితుకుటకూడ ఒక విద్య. పాలు తీయునపుడుముని చేతివ్రేళ్లతో నొక్కకుండ పిండాలి. పాడి పశువులకిచ్చు ఆహారం జీర్ణమగునట్టిదిగాను రక్తం వృద్ధిచేయునదిగ ఉండాలి. పాడి పశువులకు ఈ మధ్య చిట్టు, తవుడు, వేరుశనగపిండి, యింక రకరకముల కృత్రిమపు ధాన్యాలు పెట్టి విపరీతంగా మేపుట వలన పాడి పశువులు వట్టిపోవుచున్నాయి. రోజు వాటికి పచ్చిగడ్డి ఎండుగడ్డి మొదలగు గడ్డిజాతులను మేపుచు వాటికి రోగములు రాకుండ ఉండుటకును, క్షీరోత్పత్తికి ఈ క్రింది విషయాలను గ్రహించి ఆచరణలోపెట్టి పాడిపరిశ్రమను గృహిణులు అభివృద్ధిచేస్తారని ఆశించుతాం.

కొబ్బరిపిండి వీశెడు, శనగపిండి వీశెడు, వేయించిన మెంతిపిండి 8 గిద్దలు, శోలెడు మెత్తనిఉప్పు, ప్రత్తి గింజలు 2 శోలలు కలిపి ఒక కుండలోనుంచి రోజు పాడిపశువులు త్రాగు కుడితిలో ఉదయం పదిగుప్పెళ్లు, సాయంత్రం పదిగుప్పెళ్లు కుడితిలోవేసిన వాటికి మంచి బలము, రక్తవృద్ధి, క్షీరోత్పత్తిని కల్గించుతుంది.

---

# కార్తీక దీపం

'అరుంధతి'

"ఒరేయి బాబూ! లేవరా!"

"కాస్సేపు వుండు బామ్మా!"

"ఇంకా కాస్సేపేమిట్రా. ఐదుకొట్టింది. లేవరా బాబూ!"

"చలి గడ్డ కట్టిస్తుంటే! ... మంచంమీదనుండి లేవడానికే ప్రాణాలు పోతున్నాయి ... ఇప్పుడు యీ స్నానం యెందుకమ్మా! ... తెలవారి యెండ వచ్చిన తర్వాత చేద్దువుగాని - కాస్సేపు పడుకో."

"కార్తీక స్నానం యెండవచ్చిన తర్వాత చెయ్యడమేమిట్రా బాబూ - లేవరా!"

"లేవాలంటావా! కాళ్లు చేతులు కొయ్యబారి పోతున్నాయి."

"ఇంకొక్క పదిహేను రోజులు కష్టపడరా నాయనా! లేవరా!"

"నేనొస్తాను నడవండి. వాడు లేవడింక. మొండి ..." అంటూ మా అమ్మ వచ్చింది.

"చంటిపిల్ల తల్లివి నువ్వెక్కడికి వస్తావు యీ గాలిలో. వాడే వస్తున్నాడు. లేవరా బాబూ! మీ నాన్న లేడురా. ఊళ్లోవుంటే వాడే వచ్చేవాడు ..."

తప్పదురా భగవంతుడా అనుకుంటూ కప్పుకున్న వులన్‌రగ్గుతీసి లేచేసరికి చలికి కాళ్లుచేతులు వణికి పోవడం మొదలు పెట్టాయి. ఇంట్లో ముసలాళ్లు వుంటే ఒకటి - లేకపోతే మరొకటి! నెమ్మదిగా మఫ్లర్ తీసి తలకుచుట్టి బామ్మ సరంజామా, వెన్నెలగానేవున్నా లాంతరు (మా బామ్మకు కళ్ళు సరిగ్గా కన్పించవులెండి!) చిన్న చేతికర్ర పుచ్చుకుని బామ్మ వెనకాలే గోదావరికి బయల్దేరాను.

అసలు నిజం చెప్పాలంటే గోదావరి మా యింటికి సరిగ్గా ఒక ఫర్లాంగు. అయితే కప్పుకున్న ముసుగు తీసేసరికే ప్రాణాలు పోతుంటే - యీ ఫర్లాంగు దూరం నడిచేదెలాగ అన్న విషయం అటుంచి, అసలు మా బామ్మే కార్తీకదీపంలాగ గాలికి రెపరెప కొట్టుకుంటూ యెప్పుడు ప్రాణంపోతుందా అన్నట్లుగా వుంటే - శుభ్రంగా తెల్లవారిన తర్వాత హాయిగా బిందెడు వేన్నీళ్ళు స్నానంచేసి - కోడలు వండిపెడుతుంటే తిని - కృష్ణా రామా అనుకుంటూ యింట్లో కూర్చోక ఆవిడకీ కార్తీక స్నానాలు యివన్నీ యెందుకో! అన్నదే నా పాయింటు.

అబ్బా! ఏం చలి! కొరికేస్తోంది! కార్తీక స్నానాలుచేసి తర్వాత యే స్వర్గానికి వెడతారో కాని - మొదట యీ చలిలో నరకం మాత్రం అనుభవిస్తున్నారనిపించింది. అవును మరి, కాకపోతే యేమిటి చెప్పండి! హాయిగా ముసుగు తన్ని పెట్టి కడుపులో కాళ్ళు పెట్టుకొని వెచ్చగా పడుకోక - యెందుకొచ్చిన తిప్పలివి! ... పోనీ! ఆవిడకు తెలియకపోతే మా నాన్నకైనా తెలియక్కర్లేదూ? పైగా ఆయనే రోజూ ఆవిణ్ణిలేపి స్నానానికి తీసుకు వెడతాడు ... ఏమిటో - యింత కష్టపడే బదులు ఒక్కసారి ఆ రష్యావారి స్పూట్నిక్‌లో ప్రయాణం చేస్తే చంద్రలోకం, సూర్యలోకంకూడా చూచి రావచ్చుగా - అనుకుంటూ యేదేదో ఆలోచనా సముద్రంలో మునిగిపోయాను.

ఇంతలో బామ్మ వెనక్కు తిరిగి, "ఒరేయి బాబూ! వస్తున్నావా? మెలకువగా వున్నావా - కునికిపాట్లు పడుతున్నావా?" అంది.

"మెలకువగానే వున్నాను - కాని చలిమాత్రం చంపేస్తోంది. నువ్వు స్నానం యెలా చేస్తావో!"

"ఒక్కసారి నీళ్ళలో మునిగితే యే చలి వుండదు. నువ్వుకూడా ప్రతిరోజూ తెల్లవారుఝామునే లేచి స్నానం చెయ్యకూడదూ! ఆరోగ్యంగా వుంటుంది ..."

"ఆరోగ్యంమాట అటుంచి - జలుబుచేసిందంటే చీదుకోలేక చావాలి... ఉన్న ఆరోగ్యం చాలు..."

ఇంతలో గోదావరికి వచ్చేశాం. ఒకళ్ళా - యిద్దరా ... ఆ ముసలమ్మలను చూస్తుంటే - వాళ్ళకు మతిపోయే యీ స్నానాలు, చేస్తున్నారో కాని - నాకు మాత్రం నిజంగా మతిపోయింది.

"బాబూ - ఆ వత్తులపెట్టె, కుంది అక్కడపెట్టి, ఆ పంచి యిలా యివ్వు" అంటూ పంచితీసుకుని, తనలో తానే యేదేదో గొణుక్కుంటూ జరజరా నీళ్ళలో ప్రవేశించింది.

"ఏం వెంకమ్మగారూ - యీ వాళ మనవణ్ణి తీసుకొచ్చారు. అబ్బాయి క్యాంపు కెళ్ళాడా?" అంటూ యెదరింటి ముసలావిడ ప్రారంభించింది. నన్ను మాత్రం గట్టుమీద చలి గడ్డకట్టిస్తోంది. అటు యిటు చూచాను. నా ప్రక్కనే నిలబడింది - యెవ్వరో కాదు - ప్రక్కింటివారి నిర్మల! నా ముఖంలోకే చూస్తోందని గ్రహించాను. ఇంతలో గుడ్డి దీపం కాస్తా గోదావరి గాలికి రెపరెపలాడి ప్రాణాలు విడిచింది పాపం! నీళ్ళలో ముసలమ్మలు మునుగుతున్నారు - తేలుతున్నారు - కాని నిర్మల మాత్రం అలాగే చూస్తోంది నా ముఖంలోకి. నవ్వుదామని ప్రయత్నించింది. కాని యెందుకో ఆగిపోయింది. అదంతా నా భ్రమే అనుకున్నాను! అయితే, నిర్మలను చూచేసరికే నా చలి సగం తగ్గిపోయినట్లనిపించింది. పలుకరిద్దామంటే మాత్రం నోరు విడివడ లేదు. పైగా నోరు తెరిస్తే అసలే కాళ్ళు చేతులు వణికిపోతున్నాయి - వాటికి సాయం నోరుకూడా వణకటం ప్రారంభించిందంటే - నిర్మల నవ్వుతుందేమో నన్న భయం! అలాగే నోరు బిగించి నిర్మల ముఖంలోకి చూస్తూ నిలబడ్డాను. నిర్మలకు చలి లేనట్లుగా వుంది!

"ఈ వాళ నువ్వొచ్చావేం?" అంది ఆఖరికి. నోరు తెరవక తప్పలేదు, "అదృష్టమో - దృష్టమో మా నాన్న క్యాంపు కెళ్ళాడు" అనగలిగాను.

"అంటే..."

"అంటే యేమీ లేదు కాని ... నీకు చలివెయ్యటం లేదూ?"

"చలి - నాకు అలవాటైపోయింది!"

"అంటే - రోజూ వస్తున్నావన్న మాట!"

"ఆ. మీ నాన్న యెప్పుడొస్తారు?"

"కార్తీకమాసం ఆఖరయిన తర్వాత"

"అంటే అంతవరకు నువ్వేవస్తావన్న మాట"

"నువ్వురావా?"

"ఏం?" అంటూ నవ్వింది.

"ఏంలేదుగాని ... మాట్లాడం పూర్తిగా మానేశావేం?"

"నిన్ననేగా మీ చెల్లెలితో చింతగింజలు ఆడేటప్పుడు మాట్లాడింది. పైగా ఎదరింటి సుబ్బమ్మ చూచిందంటే - యిక చెప్పేదా! ఆవిడనోరు ఆలిండియా రేడియో! అంతటితో వూరుకోదు - ఉన్నదీ లేనిదీ కల్పిస్తుంది. మొన్న ఎగ్జిబిషన్‌లో యెక్కడ చూచిందో కాని కాకిచిప్పలా అంటించేసింది."

మేమీ కబుర్లలో పడ్డాం - మా బామ్మ అప్పుడే స్నానం, అన్నీ పూర్తి చేసుకుని, "బాబూ వెడదామా" అంది.

"దీపం పెట్టుకోవడం అన్నీ పూర్తి అయ్యాయా బామ్మా" అన్నాను యింకా ఆలస్యముందేమోనని. అబ్బే! అన్నీ పూర్తయ్యాయి [illegible]వంతుడా! అనుకుంటూ, నిర్మలముఖంలోకి చూచి మూగవాడిలా ప్రక్కకు తిరిగాను.

"రేపు వస్తావుకదూ!" అంటూ చేతిమీద గిల్లింది. వెనక్కు తిరిగి చిరునవ్వుతోనే సమాధానమిచ్చి బామ్మ వెనకాలే బయల్దేరాను.

"వాళ్ళ నిర్మల చూడరా! నీకన్న చిన్నది. బామ్మను తీసుకుని రోజూ వస్తుంది. నువ్వేమో మునుగే తియ్యనంటావు"

"తెల్లవారు ఝామునే రేపు - నేనూవస్తాను" అని నాలోనేనే నవ్వుకున్నాను.

రోజూ పడుక్కునేముందు బామ్మతో చెప్పే వాణ్ణి - నాలుగున్నరకి అలారం కొట్టగానే లేపమని. ఆ రోజు - కార్తీక మాసం ఆఖరు. నేనూ బామ్మా బయల్దేరాం. రోడ్డుమలుపులో ప్రక్కింటి సీతమ్మ గారు కనబడింది. నిర్మల లేదు.

"ఏం - ఒక్కరూ వస్తున్నారు? మనవరాలు రాలేదా?" అంది బామ్మ. ఏం చెప్తుందో యేమోనని నా గుండెలు కొట్టుకోవడం మొదలుపెట్టాయి.

"వత్తులపెట్టె మర్చిపోయింది. మళ్ళీ వెనక్కి వెళ్ళింది... సరేగాని నిర్మలను మనవడికి యెప్పుడు చేసుకుంటారు?" అంటూ నవ్వింది.

"మీ రెప్పుడు ముహూర్తం పెట్టిస్తే అప్పుడు"...

"మనవడికి యిష్టమేనా? ... ఏమయ్యా..." అంటూ యేదో అనబోయింది.

"వాడి మొఖం - వాడికేం తెల్సు. అయినా యీకాలం వాళ్ళకు అంగచందాల సంగతి యేం తెలుసు?"

"ఇంతలో నిర్మల రానే వచ్చింది." ఏమే పిల్లా మా వాణ్ణి చేసుకుంటావుటే" అంది బామ్మ నవ్వుతూ.

"ఆ! దాని ముఖం - దానికేం తెల్సు. మనమెంత చెప్తే అంత!"

ఇంతలోనే గోదావరి చేరాం. ముసలమ్మలిద్దరూ నీళ్ళలో దిగారు. మేమిద్దరం గట్టుమీద యిసుకలో కూర్చుని నవ్వుకుంటూ బామ్మ చెప్పిన విషయం గురించి మాట్లాడుకొంటున్నాం. ఆమె శరీరపు వెచ్చదనానికి ఉన్న చలికాస్తాపోయి ఊహా ప్రపంచంలో ఉద్రూతలూగుతూ, పరమానందంతో పరవశం చెందుతూ, బామ్మ స్నానంచేసి దీపం పెట్టుకుంటోందన్న సంగతికూడా గ్రహించలేదు.

"బాబూ, రారా! ఆఖరురోజు - దణ్ణం పెట్టుకో!" అనగానే ఉలిక్కిపడి లేచాం. సీతమ్మగారు కూడా బామ్మప్రక్కనే దీపంపెట్టుకొంటున్నారు. ఇద్దరం నమస్కరించి తలపైకెత్తేసరికి - ఝుంకేస్తుంది! యెదురుగా యెదురింటి పుల్లమ్మ సిద్ధం. ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది. ఆ క్షణంలో ఆవిణ్ణి చూడగానే అమాంతంగా నమలకుండా మింగేద్దామా అన్నంత కోపం వచ్చింది. అశకునపక్షి!

ఆ తర్వాత కొద్ది దినాలకే నిర్మలతో నా వివాహం జరిగింది. అంతా ఒక నాటకంలా జరిగిపోయింది. నాన్నగారికి విశాఖపట్నం ట్రాన్స్ఫరయింది. నేను, నిర్మల, బామ్మ రాజమండ్రిలోనే వుండిపోయాం.

తర్వాత ఒకనాడు రాత్రి భోజనాలయ్యాక నిర్మల నవ్వుతూ అంది - "ఏమండోయ్! రేపటి నుండి కార్తీకమాసం ప్రారంభం" ఆ మాట వినేసరికి నా గుండె ఝల్లుమంది - చచ్చానురా భగవంతుడా అనిపించింది.

"బామ్మను విశాఖపట్నం పంపించేద్దామేమిటి" అన్నాను నెమ్మదిగా.

"ఛా వూరుకోండి. ఎవరైనా వింటే నవ్విపోతారు. ఏమనుకుంటారు? పెళ్ళాం పక్కలోనుండి లేవడం బద్ధకమైందనుకోరూ! అయినా ..., ఏమండి ఆ విధవల్లనేకదా నిరుడు గోదావరికి రాగలిగారు ..." అంటూ నవ్వుతూ కళ్ళలోకి చూసింది.

తప్పదుగా నాయనా అనుకుంటూ మంచంమీద ఒరిగాను. మామూలుగానే బామ్మ ఇదుగంటలకు లేచి నిర్మలను లేపి "నిర్మలా! నేను స్నానానికి వెళ్తున్నాను. తలుపు దగ్గరగా జేరవేస్తున్నాను." అంది.

'హమ్మయ్య' అనుకున్నాను. కాని నిర్మల ఊరుకోదుగా. "ఉండండి ఆయన వస్తున్నారు. బైట చీకటిగా వుంది."

"ఎందుకు - అక్కరలేదు. వాణ్ణి పడుకోనీ నేను వెళ్ళివస్తాను." అంటుంటే "మీరు వెడతారా - నన్ను వెళ్ళమన్నారా?" అంది నిర్మల.

చలి కొరుక్కుతింటున్నా వెళ్ళకతప్పలేదు. బామ్మ కార్తీక దీపానికి ఆయుస్సెక్కువ!

# యశోధరా కుమారి

శ్రీ వేమూరి వేంకట సుబ్రహ్మణ్యం

(౬)

ప్రణయకాంక్షలు దీరు జవ్వనములోన - శాంతి నెడబాసి కారుణ్య సౌధాంతరాల
నిండు గుండెలకలచు కన్నీటఁ బ్రదుకు - నెంతకాలము కడగ్రోతు వింక తల్లి!!

పచ్చని రాచకాపురము పాలిట దుర్విధి దాపురించి, నీ
ముచ్చట ముద్దుదీరు మునుముందుగనే పతిదూరుఁ జేసి, ని
న్నిచ్చట నొంటిగా విడిచె నెంతటి పిన్నవయస్సునందె! ఈ
మచ్చరికించు జీవిత సమస్యని కెట్లు పరిష్కరింతువో!!

మెత్తని పాన్పుమీఁద సుతిమెత్తని నెమ్మెయివాల్చి రొమ్ముపై
నెత్తురు కందునొత్తుకొని నిద్దుర జోగెడి గాఢరాత్రి, ప
ర్వెత్తుకవచ్చి నచ్చెలి వచించిన క్రూర కఠోరవార్త యు
వ్వెత్తుగ గుండెపై బడ సహించితి వెట్టులనో యశోధరా!!

"కన్న కుమారుని నెమ్మిగఁ జూచు సదృష్టము లేకపోయె నా
కన్నులకం"చు శాక్య జనకాంతుడు మంచముపట్టె, నింక నీ
వన్న వియోగ దుఃఖమున కొహళితమైతివి తల్లి! ఏమి కా
నున్నదొ రాజ్యపాలన మహో! జగి బంగరుకాపు రమ్మికన్!!

కాటుక రేకలం దడిపి కన్ను గొలంకుల జారువేడి క
న్నీటి కణాలు క్రింద బడనీక, నెడందను పొంగిపొర్లు యా
రాటమునాపి, ధైర్యము బలమ్ముగనెంచి, సహింపుమమ్మ! నీ
సాటి పతివ్రతాగ్రసరుల మోయఁగ లేదు ధరిత్రిసోదరీ!!

అందము చిందునీదు మృదుహాసము కోసము కొంగుబట్టి నీ
వెందున కేగినన్ వెనుకనే చనుదెంచెడివాడు - ఏటి యా
నందము లేనికే తరలునా గహనాలకు నిన్నువీడి! లో
కుండటు పిచ్చితల్లి! కనుగొందువులే నిజమేదొ నిల్కడన్.

నాథుడు మేడలన్ విడి వనాలకు పోయినగాని - నీ మనో
వీథిని మాత్ర మెట్లుతను వీడును? నీ ప్రణయార్ద్ర నిర్మలా

రాధనమే జగత్తుకొక గతియై శాశ్వత కీర్తినొంద, నీ
గాధలు పావనమ్ములగు కావ్యములౌనుగదా! యశోధరా!!

కన్నులువిప్పి నల్గడల గాంచుము చెల్లి! త్వదీయ భక్తిగా
కొన్నది రక్తినేడు - అదుగో! భవదీయ మనోహరుండు! సం
పన్నులు వారు వీరలను భావములంద్యజియించి యెలరుగ్
ప్రసన్న నభిత్తులై కొ. వరాగ వెలుంగుచునుండె బుద్ధుడై!!
ప్రోళ్ళ చిగురింపజేసెడి ముగ్ధవాణి! – కటికిరాళ్ళను కరగించు కరుణమూర్తి!
మ్లాన వదనాల నవ్వించు మహితశక్తి! - కదలిరాసాగె రాజమార్గమ్మునంటి.
చెల్లి! నీవిరాడంబ మచ్చెరువు గొలుప–సుగతు డేతెంచె నీకళంక సోముకట్లు
కాచుచున్నాడు కారుణ్య చంద్రికలను - గ్రోలు మా కోర్కెదీర చకోరమట్లు
కను ని జవ్వనమ్ము మృతకాంతుల కాత్మను నిగ్రహించి, భా
గ్యమ్ములు ద్రోసి, నీ ప్రియకాంతుని కృత్యములోని దివ్య స
త్యమ్ము గ్రహింపగల్గితివి తల్లి! "తథాస్తు!" త్వదీయ కీర్తిగా
నమ్మలు మారుమ్రోగె భువనమ్ముల నన్నిటనో యశోధరా!!

### మాటనంగి, సభాపిరికితనం పోగొట్టటానికి బొమ్మలు

# అమెరికన్ ఉపాధ్యాయిని నూతన ప్రయోగం

బోస్టన్‌లో వాగ్దోషాలు ఉన్నవారికి, లేదా సభాకంపం ఉన్నవారికి కీలుబొమ్మలు ఔషధంలాగ ఉపయోగపడగలవు. అంటే, వాగ్దోషాలు పోయే వరకు వారి బదులు ఈ కీలుబొమ్మలు మాట్లాడుతూ ఉంటాయన్నమాట.

ఈ పద్ధతిని లూయిస్ కింగ్మన్ అనే ఆమె కనిపెట్టింది. ఆమె తన చిన్నతనంలో ఇరుగుపొరుగు పిల్లలను కీలుబొమ్మలతో ఆడిస్తూ ఉండేది. ఇప్పటికీ ఆమె వాటినే అంటిపెట్టుకొని ఉన్నది. మిస్ కింగ్మన్, బోస్టన్ యూనివర్సిటీకి చెందిన వాగ్విద్యాశాఖలో పనిచేస్తున్నది. వాగ్దోషాలున్న విద్యార్థుల లోపాలను నివారించడానికి ఆమె కీలుబొమ్మల పద్ధతిని వినియోగిస్తున్నది; ఈ పద్ధతిలో ఇతర ఉపాధ్యాయులకు శిక్షణ నిస్తున్నది.

ఈ పద్ధతి గురించి మిస్ కింగ్మన్ చెప్పే విషయం ఇది: తను సరిగ్గా మాట్లాడగలనని విద్యార్థికి ఎప్పుడైతే నమ్మకం కుదిరిందో, అతడిలో ఉన్న దోషం శాశ్వతంగా పోయేమార్గం ఏర్పడినదన్నమాటే. తన లోపాలు పూర్తిగా తొలగిపోవాలని విద్యార్థికి గాఢంగా వాంఛ ఉండాలి; ఉపాధ్యాయుడు చెప్పిన మార్గాలను అనుసరించి తీరాలని అతడిలో పట్టుదల ఉండాలి. అవి ఉన్నప్పుడు అతడికి త్వరగా నయమవుతుంది.

మిస్ కింగ్మన్ ఫ్రేమింగ్ హాంటీచర్స్ కాలేజిలో విద్యార్థిగా ఉన్నప్పుడు రెండు ముఖ్య విషయాలను గురించి అధ్యయనించడానికి శ్రద్ధ పట్టింది. వాటిలో మొదటిది వ్యాయామ విద్య; రెండవది ఉపన్యాస, నాటక కళ.

"కాలేజిలో చదువుతున్నప్పుడే నిత్యమూ వ్యాయామవిద్య బోధించగల శక్తిలేదని నాకు తెలుసు. కాని, జీవితంలో ఒక వృత్తినుంచి మరొక వృత్తిలోకి వెళ్ళడం నాకిష్టంలేదు. అందుచేత రెండు విద్యలు అధ్యయనించాను."

ఈ విద్యలలో ఆమె పట్టాపుచ్చుకొన్న తరువాత వ్యాయామ విద్యను బోధించడానికి అదే కాలేజిలో ఉద్యోగానికి కుదిరింది. అదే సమయంలో కాలేజిలో ప్రదర్శించబడిన అన్ని నాటకాలను, ప్రదర్శనలను, స్థానిక నాటకశాలలో నాటకాలను డైరెక్టు చేస్తూ, కీలుబొమ్మలలో తన సరదా పోకుండా చేసుకొంటూ వచ్చింది.

"వాగ్దోషాలను పోగొట్టడంలోనేమి, ఉపన్యాస కళాభ్యాసంలోనేమి కీలుబొమ్మల పద్ధతిని అనుసరించడం కొత్త విషయమేమీ కాదు. అయితే వీటిలో ప్రత్యేకంగా కొన్ని దోషాలు పోగొట్టడానికి నేను పద్ధతులు కనిపెట్టాను. వయస్సు, భాష, జాతి, సంస్కృతి అనే తారతమ్యం లేకుండా వీటిని అనుసరించవచ్చును" అంటుందామె.

"విద్యార్థులు గుండ్రంగా కూర్చుంటారు. ప్రతి విద్యార్థి తనకు నచ్చిన కీలుబొమ్మ పేరు చెబుతాడు. అప్పుడు నేను ఆ కీలుబొమ్మను తన పేరు చెప్పమంటాను, తనకు అన్నింటికంటె ఏ పని చెయ్యడం ఇష్టమో అడుగుతాను. ఇవన్నీ టేపు రికార్డు చేయబడుతాయి. తరువాత ఈ టేపు రికార్డులను వినిపించినప్పుడు ఆ విద్యార్థులు తమమాటలు ఎలాగ వినబడుతాయో తెలుసుకోగలుగుతారు. వాటిలో ఏలోపాలున్నవో వైద్యుడు గ్రహించి, నివారణ మార్గాలను చెప్పగలుగుతాడు.

"అంతలో ఊరుకోము. వారిచేత వ్రాయిస్తాము. కథలు చెప్పి ఆ విధంగా నాటకాలు ఆడిస్తాము. ఈ పద్ధతులవల్ల విద్యార్థులలో సృజనాత్మక శక్తి ఉద్భవిస్తుంది; ఊహా శక్తి వృద్ధి అవుతుంది. విద్యార్థులలో సిగ్గు, బెదురు మొదలైనవి పోతాయి.

"ఇతరుల ముందు మాట్లాడడానికి జంకే విద్యార్థి మీద ఈ పద్ధతి బాగా పనిచేస్తుంది. నత్తి ఉన్న వారిమీద, సభాకంపం ఉన్నవారి మీద, సరిగా మాటలు తిరగని వారిమీద కూడా ఈ పద్ధతి చక్కగా పనిచేస్తుంది."

మిస్ కింగ్మన్ కీలుబొమ్మల పద్ధతిద్వారా భాషా వ్యత్యాసాలవల్ల కలిగే చిక్కులనుకూడా తొలగించి, తద్విధంగా అంతర్జాతీయ సుహృద్భావాన్ని పెంపొందిస్తుంది. గత అయిదు సంవత్సరాలలో ఆమె దగ్గర యూరప్, దక్షిణ అమెరికా, మధ్య ప్రాచ్యం, దూరప్రాచ్యాలలోని 19 దేశాలనుంచి వచ్చినవారు చదువుకొన్నారు.

"ఈ అంతర్జాతీయ విద్యార్థులు కీలుబొమ్మలు తయారుచేశారు. అనప్రతులు మాచారు. వాటిలో అమెరికన్ పిల్లలకు తమతమ దేశాలలోని వింతలను చెప్పారు. ఇందువల్ల, ఇంగ్లీషు భాషను గడగడ మాట్లాడ్డం నేర్చుకోవాలనే అభిలాష ఈ అంతర్జాతీయ విద్యార్థులలో కలిగింది. ఎందుకంటే, ఇంగ్లీషు బాగా నేర్చుకొని ఉంటే తమదేశాల వింతలను తడుముకోకుండా చెప్పగలమని వారికి గ్రహింపు కలిగింది,

"ఇతరులు తన భాషను బాగా నేర్చుకోలేక చిక్కుపడుతున్నారని ఒక విద్యార్థి గ్రహించినప్పుడు, వారిలో కొత్తదనంపోయి ఒకరితో ఒకరు సహకరించు కుంటారు. ఇతరదేశ విద్యార్థులు, అమెరికన్ విద్యార్థులు సంభాషణలలో, భాషలలో ఒకరి నొకరు అర్థం చేసుకోడానికి సహాయం చేసుకొంటూ ఉంటారు."



మణిపూర్ గ్రామాలలో సమాజవికాస కార్యక్రమాలలో ప్రభుత్వపు లఘు పరిశ్రమలసంస్థ తోడ్పాటుతో ఇంఫాల్ కు సమీపగ్రామమందలి నొక కుటుంబము తట్టలు, బుట్టలు అల్లుతున్న దృశ్యము.





## రొట్టె వాడకం

రొట్టె (నాన్‌రొట్టె) అనేకవిధాల ఆహారంగా రూపొందించుకోడానికి అవకాశాలున్నా ఏ జ్వరము తగిలినప్పుడో, జీర్ణకోశము సరిగ్గా పనిచేయనప్పుడో తప్ప రొట్టెపై చాలమందికి దృష్టియుండదు.

కల్తీలేని నెయ్యి, నూనెలతో ఫలహారములు చేసికొనుటకవకాశము లేనప్పుడు రొట్టె, బిస్కట్లు రస్కులు, బన్‌లువాడటం మంచిది. రస్కులు, రొట్టె దైనికాహారంగా అనేకవిధాల తయారుచేసికొనగును. సులభముగా జీర్ణమగును కూడాను.

రొట్టెముక్కలను చక్రాలుగా కోసి నిప్పుసెగమీద ఎర్రగాకాల్చి వెన్న అద్దుకొని, చక్కెర అద్దుకొని తినడం చాలమందికి అలవాటు.

అలా చక్రాలుగా తరిగిన రొట్టెముక్కలను పాలలోముంచి పొయ్యిమీద నెయ్యిరాచి యుంచిన పెనంమీద వేసి, దానిపై మెత్తగా నూరిన మిరియాలపొడి, ఉప్పు చల్లవలెను. బాగుగా రెండుప్రక్కల కాలుటకు ఒక చంచా నెయ్యివేసి తీసి తినవచ్చును.

చక్రాలుగా కోసి రొట్టెముక్కలకు వెన్నరాచి, దానిమీద మిరియాలపొడి, ఉప్పు చల్లి పొయిమీది పెనంమీద ఎర్రగా కాలునట్లుచేసి తిననగును. ఇవి చాల రుచికరమేకాక ఆరోగ్యకరమైన, పుష్టికరమైన ఆహారంకూడాను.

కాఫీ హోటళ్లలో కనుపించినవల్లా తినుటకంటె రొట్టెను కనీసం పాలలోముంచుకొనియో, కాఫీలో ముంచుకొనియో తినడం మంచిది.

చివుకుల లక్ష్మీపున్నయ్య



ప. గోదావరి జిల్లా కోరుకొల్లు - అన్నపూర్ణాదేవి మహిళా సంఘ భవనంలో శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారి అధ్యక్షతన జిల్లాకలెక్టరు శ్రీ K. S. ప్రకాశరావు I. A. S. కు 13-1-59 న వీడ్కోలు సభ జరిగెను. అనంతరము శ్రీమతి D. లక్ష్మీబాయమ్మ M. L. C. అధ్యక్షతన ప్రత్యేక మహిళాసమావేశము జరిగెను. శ్రీమతి ప్రకాశరావు, శ్రీమతి D. సత్యవతి మున్నగువారు ఉపన్యసించిరి. సంఘాధ్యక్షురాలగు శ్రీమతి మంతెన లీలావతమ్మ కృషిని పలువురు ప్రశంసించుచు మాట్లాడిరి. రాత్రి 9 గం॥లకు సంఘబాలికల జాతీయ గీతముల గానముతోటి ఆరవల్లి బోర్డు పాఠశాల బాలికలచే 'ధన్య జీవి' బుర్రకథ, 'వర విక్రయము' నాటకము ప్రదర్శించబడెను. అధ్యక్షురాలి అభివందనములతో సభముగిసెను.

ద్వారపూడి పుల్లారెడ్డి

# కామాయని

మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :
శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

రెండవది ప్రతిశోధనా వృత్తి. ఆరెంటి కామె యాలోచనలు వశమైనవి. "ఒకపుడు మనువు దుఃఖియై, ఏకాకియై, నిస్సహాయుడై ఇటకువచ్చినాడు. స్వనివాస శూన్యుడైన యాపరదేశి ఇటకువచ్చి రాజ్య సంచాలకుడైనాడు. క్రొత్తక్రొత్త నియమముల చట్టములతో, నిచటి ప్రజలను చక్కదిద్దినాడు. ఆతని చట్టములే యతని మరణశాసనములైనవి. నేడాతడు మృత్యువునకై నిముసములు లెక్కించుకొనుచున్నాడు. ఏప్రజాకోటి మనువు నాత్మీయునిగ భావించి యాదరించెనో, ఆ ప్రజయే యతనికి శత్రువైనిలచెను. నాటి ఋణవంతుడు నేడు దోషియయ్యెను. నాటహితార్థియే నేడపరాధియయ్యెను. ఆహా ... ... భవిష్యమును గూర్చి యాలోచనలో, దానికై వర్తమానసౌఖ్యము నొకింత త్యాగమొనర్పవలెనను మాత్రమానలక్ష్యము చేసి, వర్తమానముననే సమస్త సౌఖ్యము ననుభవింప యత్నించుచు తనమార్గమును తానే కంటకాకీర్ణ మొనర్చికొనినాడు. ఆ ... నేనే మాలోచించుచుంటిని? మనువును రక్షించుటకొరకా? లేక ప్రతీకారమును సాధించుటకొరకా? ... ... అని యామె లోన తర్కించుకొనుచుండగా నొక ధ్వని వినిపించి యాలోచన ప్రవాహము నరికట్టెను. ఆ కంఠధ్వని శ్రద్ధ యొనర్చిన యాక్రందనము.

ఇడలేచి చూచుసరికి కరుణవేదనా పూరితమైన స్వరములో నొక యస్పష్టఛాయ గోచరించెను. ఆమె పేరు శ్రద్ధ. ఆమె శరీరము శిథిలమై, వస్త్రములస్తవ్యస్తములై, కబరిసొబగుచెడి, శిరోజములు చెదరి పత్రములు రాలినట్టి మకరందమైన పుష్పమువలె నుండెను. ఆ దుఃఖితురాలితో నొక పసిబాలుడుండెను. ఆమెను చూచి ఇడ కరుణరసార్ద్రయైయిట్లు ప్రశ్నించెను. "నిన్నెవరువంచించినారు. ఈ నిశీథ సమయమున వృథాగా నరచుచు నెటుపోవుచుంటివి? నీ దుఃఖగాథను నాకుగూడ కొంతవినుపింపుము. సుదీర్ఘమైన జీవనయాత్రయందెపుడో ఒకపుడు నీ మిత్రునితో పునస్సమాగమము సంభవించితీరును. దీర్ఘదుఃఖనిశథ మెప్పటికైన సుఖమను సుఖఃకాలమునకు తావీయకతీరదు." ఆ మాటలను వినుచు శ్రద్ధ యచటనే కొంచమాగి ముందుకు వచ్చి సౌధాంతర్భాగమునను్న 'ఇడ'ను సమీపించెను. అచ్చటనే ప్రజ్వరించుచున్నయగ్నుల వెలుగులలో క్షతశరీరుడైన మనువును కాంచి గొల్లుమనెను. "ఆయ్యో, ప్రాణప్రియా, నీవేనా? ఇట్టియాపదకేల పాలైతివి?" అని విలపించుచు తన హృదయమును, దుఃఖభావ్పముల రూపమున కండ్లలోనికి కొనివచ్చి! తదశ్రుధారలతో మనువును తర్పించెను. అదియంతయును ఇడకాశ్చర్యమైనది. శ్రద్ధయొక్క హస్తముల మధుర స్పర్శలచే మనువు మూర్ఛనుండి తేరుకొనెను. ఆతని శరీరమున కొంత సంచలనముకల్గెను. అతని కండ్లు తెరచుకొని, నాల్గుకొలకులనుండి నాలుగశ్రుబిందువులను స్పందించెను. ఆ సమయమున శ్రద్ధ యిట్లు గాన మొనర్చెను.

తుముల కోలాహలకలహమున
హృదయనిర్గత మధురవాణిని
ప్రత్యహము విశ్రాంతికొరకై
నిత్యచంచల వికలతాచును
చిత్తమదితానలసిపోవగ
ప్రాప్తమా మృదుమలయవాణిన ॥

(సశేషము)

# ప్రేమిక దంపతులు — చంద్రలోకపు — (ఊహాచిత్రము) — మధురస్మృతులు —

కీ. శే. ఆకుండి వ్యాస ప్రభాకరశాస్త్రి

(గత సంచిక తరువాయి)

శంకర్ అనాగరికుడు కాడు. స్త్రీని చూచిన వెంటనే కొంచెము సిగ్గుపడ్డాడు. పరిచారకులామె యొద్దకు అతనిని గొని పోయి వదలి ఏదో చెప్పి వెళ్లిపోయారు. ఒక విశాలమైన సింహాసనమున కూర్చున్నాడు. ఆమెవైపు చూస్తున్నాడు ఏదో చెప్పమన్నట్లు.

'ప్రేమ' అర్థం చేసుకొంది. అతనికి భాష రాకపోయినా కన్నులలో కావ్యార్థాల చెప్పగల మేధావియని తన నిర్ణయం కోసం ఎంత నిష్ఠుర పరిస్థితులలోనైనా లొంగక సాధించుకొని రాగల దీక్ష కలవాడని అర్థం చేసుకొంది.

భూలోకంలో ప్రస్తుతం అమలులో లేక పోయినా పురాతన కాలమునుండి ఋషులు తన తండ్రి ఆస్థానానికి విద్వాంసులతో పోటీ చేయడానికి వస్తూవుండేవారు దేవ భాష (సంస్కృతంలో) చంద్రలోక విద్వాంసులను సైతము ఓడించ గలిగే వారు. అందుచేత సంస్కృతములో అతనిని పరిచయం చేసుకోదలచుకొని ప్రశ్నించింది. సుగమ శైలిలో లాలిత్యంగా సంస్కృతంలో విశేషజ్ఞానం లేక పోయినా ఆంధ్రుడవడంచేత కొంత భావాన్ని ఊహించుకొన్నాడు. భూలోకం, మనుష్యులు చంద్రగోళ సందర్శనాపేక్ష. శంకర్ అని అనగలిగాడు.

అతని వివరములు సంక్షిప్తంగా ఆమె కర్థమైనాయి. చెలికత్తెలకు అనుజ్ఞ యిచ్చింది. తలంటి, పునుగు, జవ్వాది, పులిమి, ఆకుపచ్చ పసుపుపచ్చ కలసిన నునుపాటి వస్త్రములతో అలంకరించారు. 'ప్రేమ' స్వయంగా ఆ దేశపు ఫలములను క్షీరము, దధి, గంగాజలము వేర్వేరు పాత్రలయందుంచి తెచ్చి అతని ముందుంచింది. పండ్లు, ఇక్షురసం, పాలు - అన్నీ తియ్యనివే - అతనికంత తీపి తినడం అలవాటు లేదు. ఏలాగో కడుపునింపుకొన్నాడు. చక్కని వీణానాదము, సంగీతము, నాట్యము అతనిని తన్మయుని చేశాయి. అతడు ప్రేమ మనసు తెలుసుకోలేదు. ఆవిడ కరము నందున్న తాళపత్రగ్రంథాలపై అతని దృష్టి పడింది- తెరిచిచూచాడు. హిందీ అక్షరాలపోలిక

ఉన్నాయి. కూడబలుక్కొని చూచాడు. అర్థంకాలేదు. అది పూర్తిగా సంస్కృతము కాదేమోననుకొన్నాడు. అతనికంత తృప్తికరంగా లేదని భవనము మీదికి తాను నడుస్తూ తన్ననుసరించమన్నట్లు సంజ్ఞ చేసింది ప్రేమ. ఆమేడమీదనుండి చూచాడు. విశాలమైన ఆకాశం అందు మిణుకు మిణుకుమనే మణులు_మైదానాలు చక్రవాక పక్షుల పోలిన పక్షులు-కుక్కల వలెనున్న కుందేళ్లు-మందమైన చల్లనిగాలి ఆస్థితిలో శంకర్ హృదయము ప్రేమకై ఎదురు చూచింది. మెల్లగా దగ్గరచేరి ''ప్రియా! నీవు నన్ను, పూర్తిగా ఆకర్షించావు. ఎవతెవో ఎరుగను. నీవు చేస్తూవున్న పనులనుబట్టి నాయందు ఆదరంతో ఇలాచేస్తున్నావని తోస్తోంది. ఇంతచక్కని వాతావరణంలో నా హృదయంలోని ఆరాటం నీతో చెప్పక ఆగలేను. ఇందు నీతోఉండి పోవాలని ఉంది!''అని అన్నాడు. ప్రేమ అతనిని దగ్గరగాతీసికొంది అతని భాష అర్థమైనట్లు. ప్రేమరంగంలో భాషకు ప్రాధాన్యతలేదు. హృదయాలు అర్థంచేసుకోగలవు. ఆనందానికి భాష అవధుతేర్పఅచలేదు. —

అలా ఎన్ని గంటలకాలం ఉండిపోయారో తెలియదు మేల్కొన్న తర్వాత అతనికెంతో ఆకలిఅయింది. సంజ్ఞచేశాడు. అందించుకొన్నట్లమర్చింది ఆమె, - నవ్వుతూ విలాసమైన చూపులతో భాషవల్లవచ్చిన బాధనేమాత్రం ఎరుగరు. తియ్యని పదార్థాలతో విసుగెత్తింది. తనకు నచ్చలేదని త్రోసిపుచ్చాడు. పుల్లని పండ్లను తెచ్చియిచ్చింది. కొద్దిగ తీపిగఉన్నా అవి రుచించాయి. తనదేశం, ఆహారం-ముఖ్యంగా తనువచ్చినపని జ్ఞాపకమొచ్చాయి. ఆదేశమేదైనా విచిత్రానుభవాల తెలిసికొని ముందుకు సాగిపోవాలనుకొని ప్రేమను లాగుకొని భవనందాటి నగరంలోకి పోవప్రయత్నించాడు.

అతనికి నగరం చూడాలనే కుతూహలముందని తాను కూడ వెడితే అందరికి తాను తెలిసిపోతుందని ఇదిగో ఇప్పుడే వస్తున్నా. అన్నట్లు విలాసంగా బుగ్గపై చిటికవేసి మాయమైంది. వెతకాలని వెంటబడ్డాడు. ఆమె గదిలోదూరింది. బయట ఎదురుచూస్తున్నాడు. నౌకరులా కట్టుకొని అందమైన సంచి ధరించి బయటికి వచ్చింది కూడ వస్తానన్నట్లు. నగరంలో ప్రవేశించారు. వజ్రములు, పుష్యరాగములు మున్నగు మణులు సైతము చంద్రలోకంలో కొద్ది మొహరీలకు విక్రయించబడుతున్నాయి. మొహరీ పసుపువచ్చని బంగారు నాణెము. శంకర్‌కు ఏదైనా కొనుక్కోవాలని ఉంది. కాని డబ్బేది?

ఇంకా ముందుకు వెళ్లుతున్నారు. స్త్రీలు ఎక్కువగా కన్పిస్తున్నారు. నవ్వుతూ

విలాసంగా తిరుగుతున్నారు. శంకర్‌ను చూచి అంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఏదో నాట్య శాల సమీపించినట్లు ఊహించాడు.

ఇలా ఎంత సేపు గడిపినా, చీకటి పడలేదు. రాత్రి కాలేదు. అలసిపోయాడు. వెనుకకు వెళ్లిపోవాలని ప్రేమచేయి పట్టుకొని బయలు దేరాడు. కాని త్రోవలోనే నిద్రపోయాడు. ప్రేమ అతనిని తనతొడపై పడుకోబెట్టుకొంది. ప్రక్కగా వెడుతూ ఉన్న ఒకరిని సమీపంలో గంటను మ్రోగించమనికోరింది. ఆ గంట ప్రజలకు రాజుతో అత్యావశ్యకరమైన పని ఉంటే మ్రోగించి న్యాయముగా పొందవలసిన సాయంపొందవచ్చును. చంద్రమహారాజు చెవులలో మారు మ్రోగిందా ధ్వని. పరిచారకులతో వచ్చారు రాజుగారు. ఏమి కావాలని అడిగారు. తాను 'ప్రేమ' నని శంకర్ నిద్రిస్తుండాడనీ అతనిని భవనంలో చేర్చడానికి నౌకరు సహాయం కావాలని కోరింది. భవనంలో అతని ప్రక్కనే కూర్చుండి ఏదో కావ్యం చదువుకొంటూంది. అందులో మానవలోకానికీ చంద్రలోకానికి కాలములో ఉన్న వ్యత్యాసం ప్రేమికుల విరహాగాధగా వ్యక్తంచేయబడింది. చంద్రకాంతకు మానవునకు అపూర్వసంబంధము - నాయకి యొక్క ప్రేమ, త్యాగము ఆమెను ఆశ్చర్యపరిచాయి.

శంకర్ మేల్కొని ఫలహారానంతరము సంచారానికి బయలు దేరాడు. ప్రేమ అతనికి రాజనగరు, అందలి ఆయుధాగారం, సైన్యము శాస్త్ర పరిశోధన చేయుపరికరాలు, గ్రంథాలయముచూపించింది. అందులో ఒక పెద్ద 'బాంబు'లాంటి వస్తువు అతనిని ఆకర్షించింది. 'అది ఏమి?' అని అడిగాడు. అందున్న రెండు రంధ్రములలో కన్నులుంచి చూచింది. అంటే అది ఒక దూరదర్శనివంటిదని ఊహించుకొన్నాడు. తానూ చూచాడు గోళాలన్నీ కన్పిస్తున్నాయి దూరంగా. అందులో భూమికన్పించింది. వెంటనే అతనికి తన దేశం తానక్కడికివచ్చిన పని జ్ఞాపకమొచ్చాయి. 'లీల' తనకై ఎదురుచూస్తూ ఉన్నట్లు తోచింది. వెంటనే ప్రేమ చేతులు పట్టుకొని వెళ్లివస్తానన్నట్లు చూచాడు. ఆమెకు ప్రేమ కలిగింది. ఏదో బాధకలిగింది. అయినా తాను త్యాగము చేయవలసి ఉందని ఊహించింది. ఒక తివాసీవలె కన్పించు యంత్రము తెప్పించి దానిపై శంకర్‌ను నిలబెట్టింది. ఆఖరుసారి అతని చేతిని ముద్దుకొంది. శంకర్ కదలిపోయాడు. విరహంతో ప్రేమ బిగ్గరగా శంకర్! శంకర్! అని అరుస్తూంది.

లీల నెలరోజులైనా శంకర్ రాకపోవడంచేతను వార్తలనుబట్టి కృత్రిమగోళం లేక పోవుటచేతను తన ప్రియుని ప్రాణం తీసికొన్నాడని భరించరాని దుఃఖంతో చంద్రునికేసి చూస్తూ అతనిని నిందించుతూ శంకర్ అని అరుస్తూ జీవితము భారంగా సాగిస్తోంది.

శంకర్ భూమి సమీపిస్తున్న కొలది భార్యలీలను కలసికొనబోతున్నానని ఉత్సాహంతో లీలా! అని అరుస్తున్నాడు.

ప్రేమాందర నాదమో - 'శంకర్' లీలా ర్తనాదమోశంకర్ విశ్వాంతరాళంలో ప్రతిధ్వనిస్తో 'శంకర్ - లీలా'' కలిసి ఒక ధ్వని బయలు దేరింది.

—(౦)—

# సిరిసిరి మువ్వలు

ఒక కవి తాను రచించిన గ్రంథాన్ని మరొక కవిశ్రేష్టుని దగ్గరకు తీసికొనివెళ్లి చదివి దానిని గురించి అభిప్రాయము తెలుపవలసినదిగా కోరాడట. ముక్కుపొడుంఘాటుగా పీల్చి జేబులు తడుముకో సాగాడట.

కవి "ఏమండీ! జేబులు తడుముకుంటున్నారు — కలంకావలెనా!" అని అడిగాడట.

"వద్దు! వద్దు! — 'నో పెయిన్' బామ్ కొనుక్కోడానికి డబ్బులున్నవోలేవోయని చూస్తున్నాను" అన్నాడు కవి శ్రేష్టుడు.

♦ ♦ ♦

ఒక గ్రామంలోని ఎలిమెంటరీ పాఠశాలలో ఉపాధ్యాయుడు ఒక పిల్లవానితో "వేణూ! ఆ మూల ఒక గొయ్యి త్రవ్వు — స్తంభంనాటాలి" అన్నాడు.

"నేను త్రవ్వనండీ"

"అదేమిటిరా వెధవా! అలాగంటావు — వీపు చిమచిమ లాడుతున్నదా!

"అదేమిటిసార్! — మీరేగదండీ మొన్న ఎవరుత్రవ్వుకున్న గొయ్యిలో వారేపడతారన్నారు"!

వేముల కుటుంబరావు

♦ ♦ ♦

భార్య ఏమండీ! నాకు నచ్చిన చీరకొంటే మీమాటకు అడ్డురాను" అన్నది.
భర్త "అసలు నీతో మాట్లాడి లేకదా యీనికోరికలకు!" అన్నాడు భర్త.

మరువాడ సూర్యప్రకాశం

# మా ఆవిడతో షికారుకి

కుమారి వింజమూరి హేమలతాదేవి బి. ఏ.



సాయంత్రం ఆరుగంటలవుతోంది. రోడ్లన్నీ జనసమూహంతో బాగా క్రిక్కిరిసి వున్నాయి. అటుపోయేవారు, ఇటువచ్చేవారు అంతా యెవరి దారిన వారు పోతున్నారు. పడమటి దిక్కునుండి చల్లని పిల్లవాయువులువీస్తూ, మనస్సున కాహ్లాదమును గూర్చుచున్నాయి. 'శంకర విలాస్' హోటలు నుండి "ఈ జీవితమే స్వర్గము" అని సన్నగా రికార్డు వినిపిస్తూవుంది.

నేను ఆ రోజు ఒకటవ తారీఖు కాబట్టి ఆఫీసులో యిచ్చిన జీతం తీసుకొని ఇంటికి వస్తున్నాను. ఎదురుగా నాసికకు చక్కని మల్లెల సువాసన తగిలింది. వెంటనే బేడా యిచ్చి మల్లెపూలుకొని ఇంటికి వచ్చాను. ఎదురుగా మా శ్రీమతి నవ్వుతూ వచ్చింది. ఎప్పుడు యేవంటింట్లోనో కూర్చొని పనీపాటా చేసుకొనేది. యీ రోజు యిట్లా యెదురుగావచ్చి చిరునవ్వు నవ్వుతో ఉండంటే యిందులో అంతరార్థమేదో వుందనుకొన్నాను.

"దయచేయండి" అంది నవ్వుతూ.

"బయటికా, లోపలికా ?" అన్నాను నేను.

"మీ ఇష్టం. మీరు యెటువెళ్లదలచుకొంటే అటు" అంది మా శ్రీమతి.

నేనుకూడా చిరునవ్వు నవ్వుతూ లోనికి వెళ్లాను. వెంటనే నాకు వేడివేడి కాఫీని తీసుకువచ్చింది. నేను కాఫీ త్రాగటం మొదలు పెట్టాను. ఇంతలో నేను తెచ్చిన మల్లెపూలను మాలకట్టి, వదులుగా జడవేసికొని, అందులో జారిపోయేటట్లు మల్లెలను తురిమి, గులాబీషిఫాన్ చీర కట్టుకొని, తెల్లని క్రేపు సిల్కు జాకెట్టు ధరించి, గలగలమని గాజుల ధ్వనితో నా యెదుటవచ్చి నిల్చుంది మా ఆవిడ తలయెత్తి చూశాను.

"ఏమండీ ! మరి ... " అంది.

"ఆగిపోయావేం ? త్వరగాచెప్పు. నీ మృదుమధుర వాక్కులనువిన నా కర్ణములతియాసక్తితో యెదురుచూచుచున్నవిగావున నావీనుల విందుగావించి నన్నానందపరపుమని" గుక్క త్రిప్పుకోకుండా అనేశాను నేను.

"సంతోషించాంలెండి మీ కవిత్వానికి. కాళిదాసు తర్వాత మిమ్మల్నే చెప్పుకోవాలి" అంది విసుగ్గా.

నేను యెంతో ఆశగా నన్ను మెచ్చుకోవాలని తప్పులు, ఒప్పులు అన్నీ కలిపి మిశ్రమ కవిత్వం ధారాళంగాచెప్తే మా ఆవిడ నాలోని ప్రతిభను గుర్తించలేదని నాకు కొంచెం కోపం వచ్చింది. అయినా "శ్రీమతిగారితో కలహం పెట్టుకోవటమంటే మాటలా ?" అనే సంగతిని గుర్తుకు తెచ్చుకొని "అయితే నేను అపరకాళిదాసునన్నమాట" అన్నాను.

"అబ్బబ్బబ్బ ! నా మాట వినరేమిటండీ !" అంది.

"సరేలే. ఆ చెప్పదలచుకొన్నదేమిటో మూడుముక్కల్లో, నన్ను విసిగించకుండా త్వరగా చెప్పు" అన్నా.

"ఇవ్వాళ సాయంత్రం 6 గంటలకు ప్రఖ్యాత సినీతార నళిని నృత్యప్రదర్శన మున్నదట. టికెట్టు

ఒకటి 10 రూపాయలట. నేను రెండు టికెట్లు మన యిద్దరికి తీసుకున్నాను. మరి మనం వెళ్దామా?" అంది మెల్లగా.

"సరేలే! దొరసానిగారి ఆజ్ఞ జవదాటితే..." నేను వాక్యం పూర్తిచేయక మునుపే "త్వరగా రెడీ కాండి దొరగారూ" అంటూ శ్రీమతి పాంటూ, షర్టూ తెచ్చింది.

"తప్పదు" అనుకుంటూ నేను పాంటూ షర్టూ తొడుక్కొని శ్రీమతితో బయటకు నడిచాను.

దారిలో నా చిన్ననాటి స్నేహితుడు రామం కనిపించాడు. మేము చిన్నప్పుడు చదువుకొనే రోజుల్లో వాడు బహు సోమరిగా వుండేవాడు. క్లాసులో పాఠాలేమీ వినేవాడు కాదు. వాడిని అందరు "ఒరేయ్ సోమరిపోతూ" అని పిలిచే వారు. వాడు ఇప్పుడు పెద్ద ఆఫీసరయ్యాడు. నేను క్లాసులో ఫస్టయినా నాకు మాత్రం గుమాస్తా వుద్యోగం దొరికింది. "ఏమి నీ లీలలు భగవాన్! క్లాసులోని ఒక మొద్దుకి పెద్ద ఆఫీసరు హోదా! ఫస్టుగావుండే నా బోటివాడికి గుమాస్తా వుద్యోగమా!" అనుకున్నాను.

ఇక నేను వాడితో ప్రసంగం మొదలు పెట్టానో లేదో మా ఆవిడ నా వైపు కొఱకొఱ చూచింది. ఆ చూపులధాటికి తట్టుకోలేక నేను రామంతో "వెళ్ళొస్తాను బ్రదర్. పనుంది" అన్నేసి ముందుకి నడిచాను.

ఇక మా శ్రీమతి నా మీద పెద్ద వాఖ్యానం మొదలుపెట్టింది. "మీ మొగవాళ్ళంతా యింతే. కనబడిన ప్రతివారితోను ఖాతాఖాని పెట్టుకుంటారు. మేము ఆడవాళ్ళం రోడ్డుమీద అట్లా నిలబడినా మీరేమీ అనుకోరు. నడిరోడ్డుమీద నిలవబడలేక మేము సిగ్గుపడాలి కాని మీకేమీ పర్వాలేదు" అని యింకా యింకా ఏమేమో తీవ్రమైన వాక్కుల వర్షం కురిపించింది నా మీద.

నేను ఆమెవైపు గుడ్లప్పగించి చూస్తూ వుండి పోయాను. అంతకంటె ఏంచేయగలను?

ఇంతలో ఆమె స్నేహితురాలు విమల మా కెదురైంది. ఆమెను చూచి చూడటంతోటే "హల్లో విమలా! ఏమిటి సంగతులు? ఈ మధ్య అసలు కన్పించటమేలేదే?" అంటూ మా ఆవిడ ఆమెతో ఖాతాఖాని పెట్టుకుంది. ఇక యెంతకీ ముగించే టట్లులేదు. ఈ ఆడవారి నోటిని కట్టేయటం ఎవ్వరికీ సాధ్యపడదనుకొని "మన ప్రోగ్రాం" అన్నాను మెల్లగా వినిపించేటట్లు. అప్పుడు కబుర్ల లోకం నుండి మన లోకంలోకి వచ్చిపడింది ఆమె. విమలకు 'గుడ్ బై' చెప్పి "ఇక నడవండి" అంది నా వైపు చూచి, ఇంతసేపు తప్పంతా నాదే నన్నట్లు ఫోజు పెట్టి.

"ఇందాక నేను రామంతో ఒక్క అరనిముషం మాట్లాడేటప్పటికి పెద్ద రాద్ధాంతం చేసిన మా ఆవిడ యిప్పుడు తను గంటసేపు విమలతో ఎట్లా ఖాతా ఖాని పెట్టుకుందో!" అని అడగాలనిపించింది నాకు. కాని మళ్లీ ఎందుకీ రభసయని వూరుకున్నాను.

మేము యింకా కొంతదూరం నడిచేటప్పటికి "టైం ఎంతయిందండీ?" అంది.

రిస్టువాచి కేసి చూశాను. "5.30 అవుతోంది" అన్నాను.

"ఇంక అరగంటలో మనం అక్కడికి చేరుకోవా లన్నమాట" అంది ఆదుర్దాతో.

"అవును మరి నీవు కనబడిన వాళ్ళందరితో అంతంత సేపు ఖాతాఖానిపెట్టుకుంటే మనం అక్కడికి చేరినట్లే" అన్నాను నేను వుండబట్టలేక.

"సరే మరి త్వరగా నడవండి" అంది మా ఆవిడ. ఇంతలో పటపటమను చినుకులతో వర్షం ప్రారంభమైంది. దరిదాపులో యెక్కడా బండ్లు కన్పించ లేదు. ఇక చేసేది లేక తడుస్తూనే నడవటం మొదలు పెట్టాము. వర్షం మరీజోరుగా కురుస్తోంది.

"గొడుగైనా తీసుకురాలేదే!" అంది ఆమె

"వానవస్తుందని కలగన్నామా యేమిటి?" అన్నా నేను.

రానురాను ఉరుములతో, మెఱుపులతో వర్షం మరీ అధికమైంది.

ఇక మేము ప్రక్కనున్న ఇంట్లోకి జొరబడ్డాము. ఆ ఇంట్లో భార్యాభర్తలిద్దరూ, ముగ్గురు పిల్లలూ వున్నారు. మమల్ని చూడగానే చాపవేసి కూర్చోమన్నారు.

"చూడండి మీరు ఆఫీసునుండి కొంచెం త్వరగా వస్తే హాయిగా నళిని నృత్యప్రదర్శనానికి వెళ్లేవాళ్లము. మీరు ఆలస్యంగా రావటంవల్లనే ఈ బాధంతాను," అంది మా ఆవిడ తప్పంతా నాదైనట్లుగా

"నీవు విమలతో అంత సేపు బాతాఖాని పెట్టుకోకుండావుంటే ఈపాటికి యెప్పుడో అక్కడికి చేరేవాళ్ళము" అన్నాను నేను వుక్రోషం పట్టలేక.

"ఏమయితేనేం లెండి. మీరుబయలుదేరటమూ — సరిగా అదే సమయానికి వానరావటమూ" అంది ఆ ఇంటావిడ.

ఇట్లా మా సంభాషణతో చాలటైం గడచిపోయింది. వాన అప్పుడే వెలసింది. రిస్టువాచిలో చూశాను. 10 గంటలు అవుతోంది.

"ఇంతరాత్రి యెక్కడికి పోతారులెండి. ఈ రాత్రికి ఇక్కడేవుండండి" అన్నారు భార్యాభర్తలిద్దరూ.

"పర్వాలేదులెండి" అని వాళ్లకి థాంక్సు చెప్పి యిద్దరం బయటకునడిచాము.

"ఉండండి బండిని పిలుస్తాను." అని ఆ ఇంటాయన ఒక బండిని పిలిచారు. దానిలో యెక్కి నేనూ, మా ఆవిడ ఇంటికి చేరాము.

"అయ్యో! రెండు టికెట్లు 20 రూపాయలకు కొన్నానే! ఆ ఇరవై రూపాయలూ పెట్టితే జార్జెట్ సిల్కు చీర యింకొకటి వచ్చేది! నీలిరంగుజార్జెట్ చీరను కొనాలని నాకు ఎన్నాళ్లనుంచో ఆశగా వుంది. హాయిగా గులాబీజార్జెటు చీరతోపాటు నీలిరంగు జార్జెటు చీరకూడా వచ్చేది. మనం అనవసరంగా 20 రూపాయలు నష్టపోయాం!" అంది మా ఆవిడ దిగులుగా.

"ఇంకానయం! వానలో తడవకుండా మంచి ఆశ్రయం దొరికినందుకు సంతోషించు. వానలో తడిస్తే నీవు కట్టుకున్న ఇరవైరూపాయల గులాబి చీర పాడయిపోయేది. కాబట్టి మనం 20 రూపాయలు నష్టపడలేదని తృప్తిపడు" అన్నాను నేను.

ఇప్పుడు మేము 20 రూపాయలు నష్టపడ్డామో లేక మాకు 20 రూపాయలు లాభమొచ్చిందో అనేది మా ఇద్దరిలో ఎవ్వరికి బోధపడలేదు.

# జగత్సృష్టి

శ్రీమతి పాతూరి విశాలక్షమ్మ



తొలుత ఈ ప్రపంచము ప్రళయకాలమందు చీకటిమైయుండెను. ఆ ప్రళయమందు సృష్టి సామర్థ్యముగలవాఁడగు పరమాత్మ తనంతట తానే నుత్పన్నుఁడై ప్రకాశించుచుండెను.

బహిరింద్రియములకగోచరుఁడు, అవయవరహితుడు, నిత్యుఁడును, సకలవేదపురాణేతిహాస ప్రసిద్ధుడైన పరమాత్మ మహదాది రూపములతో నావిర్భవించెను. అంత నాపరమాత్మ సృష్టికి కారణమైన నీరు పుట్టుగాకయని నీటిని సృజించి అందు స్వశక్తిరూపమైన బీజముంచెను. ఆ బీజము బంగారు వన్నెగల అండమాయెను. నీరు నారములనబడును. అట్టి నారములీ పరమాత్మకునికి పట్టగుటచే నీ పరమాత్మ నారాయణుఁడని పిలువబడుచుండెను. ఏయీ పరమాత్మచే సృష్టింపబడిన పురుషుడు లోకమంతట బ్రహ్మయని వ్యవహరించబడుచున్నాఁడు.

ఒక సంవత్సరము ఆ యండమందు నిలచి పిదపదానిని రెండుగచేసెను. పై చీలికచే ఆకసమును క్రింది చీలికచే భూమియు నడుమబయలును, నెనిమిది దిక్కులను శాశ్వితమైన నీటి పట్టును నిర్మించెను. అంత బ్రహ్మ పరమాత్మనుండి సదా సదాత్మకంబైన మనసును గ్రహించెను. ఆత్మకుపకారములైన సత్త్వరజోస్తమోగుణములను, విషయ గ్రహణ శక్తిగల ఇంద్రియములను సృష్టించెను.

ఆత్మవృత్తిచే తెలియదగినవికనుక పురుషములను స్వకార్య సంపాదనచే వీర్యవంతములైనపంచమహాభూతములను, మహత్తత్త్వము, అహంకారము అను నీయేడింటి యొక్క నిత్యములైన కారణములచే తనే అనిత్యములైన కార్యరూప ప్రపంచము జన్మించుచున్నది. పరమాత్మ వీటికి వేదప్రకారము నామములు కర్మలేర్పాటుచేసి వేర్వేరు లౌకికవృత్తులు కల్పించెను.

మఱియు ఈ బ్రహ్మ ప్రజలను సృష్టింపగోరి కాలమాస, ఋతు, ఆయనము మొదలగు కాలభాగములను నక్షత్రములను సూర్యాదిగ్రహములను, స్థలములను, మిట్టపల్లములను, నదులుసముద్రములను, తపస్సు వాక్కు, శ్రద్ధకామము, కోపమును సృష్టించెను. ధర్మాధర్మకార్యములను తెలుపుటకై శాస్త్రములనేర్పరచెను. సృష్టికర్తయగు బ్రహ్మ ఆదియందు

ఏయే జాతినేయో కర్మలందు సృష్టించెనో అట్లే ఆయాజాతి ఆయా కర్మలందు స్వకర్మవశమున జొచ్చుచున్నది. బ్రహ్మ సృష్టిలో కఠినము, కనికరము, దయ, ధర్మము, ఏయోజాతులకు నేర్పరచెనో, అట్లే ఆయాజాతి ఆవలగూడ నా గుణములనే బొందుచున్నవి.

భూలోక విస్తారమునకై బ్రహ్మముఖము, బాహువులు, ఊరువులు, పాదములు, బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర జాతులను సృష్టించెను. బ్రహ్మ తన దేహము రెండుగుచీల్చుకొని ఒక భాగము పురుషుడుగను మరియొక భాగము స్త్రీగను మారెను.

బ్రహ్మప్రజలను సృష్టింపగోరి మహాతపం బొనర్చి పదుగురుప్రజాపతులను సృష్టించెను. వారు మహర్షులను, మనువులను సృష్టించిరి. వీరే యక్షకిన్నర గంధర్వులను, పశుపక్ష్యాదులను, సూక్ష్మజీవులను సృష్టించిరి. ఇట్లు స్థావరజంగమ రూపకమైన సకల వస్తువులను సృష్టించిన బ్రహ్మసృష్టికాలము ప్రళయకాలములో చేర్చుచు తనలో తానే అంతర్ధానుడగును. ఎప్పుడు దేవుడు మేల్కాంచునో అప్పుడే జగత్తువ్యాపారముకలదగును. ఎప్పుడు నెమ్మదిగలవాడై నిద్రించునో అప్పుడు సర్వములయమగుచున్నది. ఎప్పుడే జీవులన్నియు పరమాత్మయందు లీనమగుచున్నవో అప్పుడా బ్రహ్మ హాయిగ నిద్రించును. ఎప్పుడే జీవుడు ఉఛ్వాస నిశ్వాసములుమాని నిద్రించునో అప్పుడా దేవుడు దేహమునుండి తొలగిపోవుచున్నాడు. నాశరహితుడైన యాబ్రహ్మ యివ్విధంబుగ జాగ్రత్స్వప్నావస్థలచేత నెల్లప్పుడు స్థావర జంగమాత్మకమైన ప్రపంచమును సృజించుచు నశింపచేయుచుండును.

—(o)—

"రాధా! నిన్ను, నీ అందాన్ని చూచి ప్రేమాతిశయంతో నా తల పిచ్చెక్కిపోతున్నది. నీ కోసం ప్రాణాలైనా అర్పిస్తాను" అన్నాడు ఒక ప్రేమికుడు.

"వద్దు! వద్దు! ప్రాణాలర్పించ పూనుకున్న మీరు నన్ను ప్రేమించడమెందుకూ!" అన్నది తిరస్కరిస్తూ.

మరువాడ వెంకటరమణమ్మ

# పరిణామము

శ్రీ గాడేపల్లి శంకరం

—(౦)—

(గతసంచిక తరువాయి)

## చతుర్థాంకము :

### ఒకటవ రంగము

ప్రదేశము:-కలెక్టరు ఆఫీసు

ప్రవేశము:-సబ్ కలెక్టరు మూర్తి ఐ. సి. యస్. ఫైల్సు చూసుకుంటూ ఉంటాడు - గది ఇవతల డఫేదారు ఉంటాడు - కొంచెం అవతలగా ఇద్దరు రిజర్వు పోలీసులు పహరా ఇస్తూంటారు-

డి. పో. సూ:-(ప్రవేశించి) లోపల ఎవరేనా ఉన్నారా ?

డఫేదారు:-ఎవ్వరూ లేరు - తమరెళ్లండి.

డి. పో. సూ:-(సబ్ కలెక్టరు రూములో ప్రవేశించి శాల్యూట్ చేస్తాడు - ఒక నివేదికను సమర్పిస్తాడు.)

మూర్తి:-(సబ్ కలెక్టరు) ఆ నివేదికను ఎగాదిగా చూసి వాటీజ్ దిస్ రెపొాట్.

డి. పో. సూ:-యెస్. సార్ (ఒక నిమిషం నిశ్శబ్దం)

మూర్తి:-లెట్ మి, నో ఫస్టు ది ప్రజెంటు సిట్యుయేషన్ ఇన్ డీటెయిల్.

డి. పో. సూ:-గాంధీ ఇర్విన్ ఒడంబడిక తరువాత పరిస్థితులు చాలా మారిపోయినాయి సార్ - ఈ సాల్టు సత్యాగ్రహంలో జయం పొందాక ప్రజలు యేలం వెర్రిగా వేలకువేలు మూవెంటులో చేరిపోతూ ఉన్నారండి - పోలీసులంటే భయం లేకుండాపోయింది - ఫారెన్ గూడ్సు బాయ్‌కాట్ అని ఈ వాలంటీర్లు ప్రతి బట్టల షాపు దగ్గర పికెటింగు చేస్తావున్నారండి - ఆ కారణం చేత బిజినెస్ అంతా బంద్ అయిపోయిందని మర్చంట్సు అంతా మహా గోలపెడతావున్నారండి - కల్లు సారాయి దుకాణాలవద్దకూడా పికెటింగు సాగుతూవుంది - దీని మూలాన ఇజారా పాటదార్లు విస్తారంగా నష్టపోతావున్నారండి - మళ్ళీ సంవత్సరం పాటదారు యెవడేనా దొరుకుతాడనే ఆశలేదు సార్ - ఎక్సైజ్ డిపార్టుమెంటుకి వచ్చే నష్టం ఇలా ఉండగా - వర్తకమంతా అట్లా బంద్ అయిపోగా - లక్షల్ కొద్దీ - పొలిటికల్ ప్రిజనర్సుల యెరెస్టులతోను - మీటింగులు - పికెటింగులు - ఊరేగింపులు - ఉపన్యాస ప్రోగ్రాములతో పోలీసు డిపార్టుమెంటు సి. ఐ. డి వారికి ఊపిరి సలుపకుండా ఉందంటే సార్ :

మూర్తి:-ఊఁహూ !

డి. పో. సూ:-ఈ సిట్యుయేషన్ ఇట్లాగే కంటిన్యూ అయితే లా అండ్ ఆర్డర్ లేకుండాపోయి - అరాజకం యెక్కువై పోతుందేమోనని నాకు చాలా భయంగాకూడా ఉందండి. ఏవిధంగానైన ఈ మూవెంటుని సప్రెస్ చేసే ఉపాయం ఆలోచించి ఆర్డర్స్ దయచేయాలని ప్రార్థిస్తున్నాను సార్ - పెద్ద తలకాయలవాళ్ళని జయిల్లోపారేసి - ఇప్పటికే జయిల్సు భర్తీఅయిపోయినాయి గనుక - మిగతావాళ్లని లాఠీచార్జిచేసే - గన్సు ఫైరుచేసి భయపెట్టి - మూవెంటుని కొంత అదుపులోకి తేవచ్చుననుకుంటున్నాను సార్!

మూర్తి:-ఇజ్ ఇట్ సో! ఆల్ రైట్ - ఆర్డర్స్ విల్ బి ఇష్యూడ్ ఇఫ్ నెససరీ, యు కెన్ గో!

డి. పో. సూ:-థాంక్యూ సార్ (అని శాల్యూట్ చేసి వెళ్ళిపోతాడు)

మూర్తి:-(ప్యూనుకోసం బెల్ కొట్టుతాడు)

దఫేదారు:-(ప్రవేశించి) కలెక్టరుగారు చూసి చేసిన ఫైల్సు అన్నీ బొత్తిగా తీసుకుంటూ వుండగా)

మూర్తి:-(గడియారంవంక చూసి) డ్రైవరుని కారు తీసుకు రమ్మనూ - అప్పన్నా!

దఫేదారు:-చిత్తం - చిత్తం - (గభాలున ఫైల్సు అక్కడే వదిలేసి వెళ్ళిపోతుండగా)

(తెర)

చతుర్థాంకము రెండవ రంగము

ప్రదేశము:-బజారు - బట్టల దుకాణాలు.

ప్రవేశము:-డాక్టరురావు - దుర్గాబాయిల ఆధ్వర్యక్రింద పికెటింగుచేస్తూన్న వాలంటీర్లు-

పాటలు

కట్టాకురా - సీమాగుడ్డా
ఇటుపై కట్టానచు ఒట్టు పెట్టారా బిడ్డా!
కట్టాకురా - సీమాగుడ్డా!
మనజాతి మన మతము
మాటాను మరిపించీ
మతిభ్రష్టుచేసేటీ ఆ మాయ బట్టానికి
కట్టాకురా - సీమాగుడ్డా॥

నూలు వడికే విధము తెలియండీ జనులారమీకు
నూలువడికే విధము తెలియండీ జనలారమీగా
విధము కనుగొని లాభ మొందండీ
నూలువడికే విధము తెలియక - సాలంకరువని
కోట్లా రూపాయీలు పరదేశాలపాలు చేయబోకను॥
ముతుక నూలని మూతి ముడువకుడీ జనులార
మీరు ముతక నూలని మూతిముడువకుడు జనులార
సతతము వడుకుచుండిన సన్నమగునండీ
ముతుక నూలని మూతి ముడుచుక బ్రతుకు తెరువిక నైన
చూకుకు, పతితపాదకుడైన గాంధిమేని చేసిన బోధ
లనువిని ॥నూ॥
మల్లుపంచలమాట మరువండీ జనులార మీరా తెల్ల
మాయకు తెల్లబోకండి.
మల్లుపంచలమాట మరువక తెల్లమాయకు తెల్ల
బోయిన చిల్లిగవ్వే నాను మిగులరు కల్లగాదిది రొదను
దలపుచు॥

ఒకరు:-మానండిబాబు దయచేసి మానండి - మిల్లు గుడ్డలమాట యిక మరచిపొండి-

ఇంకొకరు:-ఆలుబిడ్డలగతి అధోగతిపాలు చేయకండి.

మరొకరు:-చేతితో వడికి నేసిన బట్టకీ మిల్లులో తయారైన గుడ్డకీ తేడా గ్రహించలేరు బాబూ?

దుర్గాబాయి:-బట్టవిలువ గ్రహించలేక పోయినా బ్రతుకు విషయమైనా ఆలోచించాలిక దా! లాంక్ షైర్ మిల్లు యజమానులు లక్షాధికార్లు అవుతున్నారు - లాలించి ప్రేమించిన మన తల్లి భిక్షాధికారి అయింది. - కోట్లకొలది ప్రజలను కూటికిలేకుండాచేసి గ్లాస్కో వర్తకులంతా కోటీశ్వరులయ్యారు. ఏడుకోట్ల ప్రజలకి ఏడురోజులకోపూటయైనా పూర్తి భోజనంలేదని యేడుస్తున్నారు - ఆ యేడుపులు మీకు వినబడంలేదూ?

డా. రావు:-దేశీయసరుకుల నేకొని-మీరు మీ దేశాన్ని ఉద్ధరించాలి - దేశకళ్యాణానికి దారి తీయాలి - ప్రాజ్ఞులైన మిమ్ములను - ఇంతకన్నా ప్రార్థేయపడనవసరంలేదు-విదేశవస్తు బహిష్కరణ స్వదేశ వస్తుస్వీకరణ - అస్పృశ్యతా నివారణ - హిందూమహమ్మదీయ సఖ్యత-మద్యపాన నిషేధం - సహాయ నిరాకరణలో కూడిన సత్యాగ్రహోద్యమము-శాసనోల్లంఘనము తే ఆదినుంచీ కాంగ్రెస్సు

యొక్క రాజనీతి అయివుంది-త్యాగమే కాంగ్రెస్సుకి ప్రాణము - ప్రజాసామాన్యమే కాంగ్రెస్సుకి శరీరం - సత్య - అహింసలే కాంగ్రెస్సు యొక్క కవచం-ప్రజలే కాంగ్రెస్సు-కాంగ్రెస్సే ప్రజ-అటువంటి మహాసంస్థయైన కాంగ్రెస్సుని-దాని అధినేతయైన మహాత్ముని అనుసరించండి -

డి. పో. సూ:-(పోలీసులతో ప్రవేశించి) ఏమిటయ్యా! రావూ! ఇక్కడంతా గలాటా చేస్తున్నారు?

డా. రావు:_గలాటా ఏమీలేదు - గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి _ ఇక్కడ పికెటింగు జరుగుతూవుంది-

డి. పో. సూ:_పికెటింగులేదు _ పిండాకూడులేదు_ పొండయ్యా _ ఇక్కడినుంచిపొండి _

దుర్గా:_అయ్యా! ప్రజలకి తినడానికి పిండాకూడు లేదనే పికెటింగు చేస్తున్నాము _

డి. పో. సూ:_చేశావులే _ చాలా సంతోషించాము గాని _ రోడ్డు ఖాళీచేస్తారా? లేక చేయించమన్నారా?

డా. రావు:_ప్రభుత్వపు ఆర్డరు మీకు ఎల్లాగవుంటే_ అల్లాగే చేయవచ్చు _ తమరూ ప్రజాసేవకులే కాదూ! ఈ సత్యాగ్రహులు మాత్రం శాంతిదూతయైన మహాత్ముని శాసనమే శిరసావహిస్తారు గాని _ అన్యుల ఆజ్ఞలకు అనువర్తులు కాలేరు _ క్షమించాలి_

డి. పో. సూ:_క్షమించటంలేదు _ గిమించటంలేదు_ దెబ్బలోగాని పట్టుకున్న దెయ్యం వదలిపోదు వీళ్ళని ఏయ్ _ పోలీస్ _ బజాయించండిరా _ తుక్కు బజాయించండి _ మారో _ కొట్టు _ తన్ను తవ్విపాతేయించు _ లాఠీచార్జీ _ లాఠీ చార్జీ!

(లాఠీలతో పోలీసులు సత్యాగ్రహులను బాదుతారు_పాపం వాళ్లు అమ్మోయి బాబోయి అంటూ చెల్లాచెదరై పోతారు_అక్కడేవున్న డాక్టరు రావుని దుర్గాబాయిని లాఠీలతో చావమోదుతారు _ బోలో భారత్ మాతకూ జై _ సత్యాగ్రహ సమరానికీ జై _ శాంతిదూత మహాత్మాగాంధీకి జై _ అంటూ ఇద్దరూ స్పృహతప్పిపడిపోతారు _ పోలీసులే చేతులమీద వేసుకు తీసుకుపోతారు _ జాలిగా సంగీతం రోధిస్తుంది.)

(తెర వాలిపోతుంది)

చతుర్థాంకము మూడవ రంగము

ప్రదేశము:-కలెక్టరు మూర్తిగారి భవనం-హాలుకి చేరియున్న పడకగది -

ప్రవేశము:-లలిత వీణవాయిస్తూ జాలిగా పాడుతూ వుంటుంది -

ఆఖరిచరణం పాడుతూవుంటే మూర్తి ప్రవేశిస్తాడు-పాట పూర్తి అయిన తరువాత)

మూర్తి:_ఎక్సలెంటు అండ్ యాప్ట్‌గావుందిసుమా ఈ పాట ఎవరు వ్రాసింది-

లలిత:_దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "కన్నీరు"లోది_

మూర్తి:_ఎవరాయనా?

లలిత:_గాడేపల్లి శర్మగారిని ఎరుగుదురా?

మూర్తి:_శ్రద్ధానంద ఘాటులో ఉపన్యాసాలిచ్చే శర్మగారేనా

లలిత:_ఆయన అల్లుడే ఈయన -

మూర్తి:-అలాగా మామగారు మాటల్లోను - అల్లుడుగారు పాటల్లోనూ గట్టివాళ్లే!

లలిత:_మీరెంత సేపయింది వచ్చి.

మూర్తి:_ఒకగంటఅయింది _ కచేరి సావిట్లో కాగితాలు చూస్తున్నాను.

లలిత:_మీరు బొత్తిగా తీరుబడిలేకుండావున్నారు'

ఇంటి కొచ్చినా కచేరీ వ్యావహారాలేనా — కాస్త పళ్లరసం తెచ్చియిస్తా నుండండి (వెళ్లబోవును)

మూర్తి:—(చేయి పట్టుకొని ఆపి) ఒక గంటక్రింతమే ఆఫీసు బాయ్ చేత కాఫీ తెప్పించుకొని త్రాగానులే. ఇక యిప్పుడు ఏమీవద్దు — (పడకకుర్చీలో కూర్చుని) లలితా! అపురూపవతియైన భార్యకంటె — అనుకూలవతియైన భార్యవుండటం — చాలా ఆనందంకాదూ?

లలిత:-స్త్రీలకి సౌశీల్యమే సౌందర్యము — పతియే అలంకారమున్నూ పత్యనుసరణకంటె స్త్రీకి కావలిసిందేమున్నది?

మూర్తి:—డాక్టరురావు చెప్పినట్లు - పత్నీస్వీకారము పదవీ స్వీకారము ఒకే సారి జరిగాయి. ఒకటి ఆనందానుభవాన్ని యిస్తే — రెండవది అధికారానుభవాన్ని యిస్తోంది.

లలిత:—మీమాటల ధోరణి నాకు అర్థంకావటంలేదు.

మూర్తి:—అబ్బే ఏమీలేదు — అధికారం! అధికారమని వ్యామోహపడతారేగాని అది నిర్వహించడం చాలా కష్టంసుమా!

లలిత:—నిజమే - మానసిక ప్రవృత్తికి అధికార నిర్వహణ భిన్నంగా ఉన్నప్పుడు మరీ కష్టంగా ఉంటుందిలెండి.

మూర్తి:—మనదేశంలోగల దరిద్ర దేవతను సాగనంపటానికి - దేశానికి స్వాతంత్ర్యము సంపాదించటానికి-బ్రిటీషు వారితో ధైర్యంగా పోరాడుతూ వున్న సంస్థ కాంగ్రెస్సు - ప్రజాబాహుళ్యంలో దానికిగల పలుకుబడి దేనికీ లేదుగదా!

లలిత:-అవును.

మూర్తి:—ఈ సంస్థను అణచివేసేస్తే శాశ్వతంగా దేశాన్ని ఏలుకోవచ్చునని — ప్రజలు అసహాయులై — ప్రభుత్వానికి విధేయులై వుంటారని - బ్రిటిష్ పొలిటీషియన్సు భ్రమపడుతున్నారు —

లలిత:—బుద్ధి తెలివి తక్కువ,

మూర్తి:—దానికి అనుగుణ్యంగా వెల్లింగ్డన్ వైస్రాయిగా వచ్చినది లగాయితు అతడు అవలంబించే నిర్బంధ విధానానికి అంతూపంతూలేకుండా ఉంది—

లలిత:—ఆరువారాల్లో అణచివేస్తానంటున్నాడుటగా! ఏవిధం అవలంబిస్తాడు?

మూర్తి:—ప్రప్రథమంగా కీలకస్థానాల్లోవున్న ఇండియన్ ఐ. సి. యస్. ఆఫీసర్ల నందర్నీ డిస్ప్లేస్ చేస్తున్నాడు, వీళ్ళస్థానే యూరోపియన్లని వేస్తున్నాడు — ఆర్డినెన్సుమీద ఆర్డినెన్సు జారీ చేస్తున్నాడు — ఇతడు అవలంబించే క్రూరపద్ధతులు చేసే అత్యాచారాలు — బ్రిటిష్ గవర్నమెంటు ఆమోదిస్తున్నారు —

లలిత:—అయితే ఉద్యమాన్ని అణచివేయగలదంటారా?

మూర్తి:—తాత్కాలికంగా అయితే కావచ్చుననుకో— కాని ఇలాంటి సమయాల్లో మా బోటి ఇండియన్ ఆఫీసర్లకి అధికార నిర్వహణ ఎంత కష్టంగా ఉందనుకున్నావు?

లలిత.—అవును — అందులోను మీకు చిన్నప్పటి నుంచి మాతృదేశమన్నా మానవసేవన్నా అమితమైన గౌరవంకూడాను - ఇప్పుడు పాపం - మీకు మరీ కష్టమనిపిస్తుంది -

మూర్తి—మా నాన్నగారు ఎక్కడకు వెళ్లారు?

లలిత:—ఇప్పటివరకు ఏదో పేపరు చదువుతూనే వున్నారు - ఇప్పుడే అలా క్లబ్బుకేసి వెళ్లివస్తానన్నారు -

మూర్తి:—అయితే లలితా! ఓ విషయంలో నీ అభిప్రాయం కావాలి నాకు -

లలిత:—ఏ విషయంలో?

మూర్తి:- ప్రస్తుత పరిస్థితినిబట్టి ఆలోచిస్తే మా బోటి ఆత్మగౌరవంగల ఇండియన్ ఆఫీసర్లు రిజైను చేయ వలసిన అవసరం వస్తుందేమోనని అనుకుంటు న్నాను.

లలిత:- అటువంటి విషమపరిస్థితులే వస్తే ఆత్మగౌరవం నిలబెట్టుకోవలసిందే! సందేహం ఎందుకు? నా అభిప్రాయం మరో విధంగా ఉంటుందను కున్నారా?

మూర్తి:- క్షమించు లలితా! ఒక వంక రావ్ సాహెబ్ గారి కూతురవు మరోవంక స్వామి నాయఁడుగారి కోడలవుకదా ఏమో అనుకున్నాను నీ ధైర్య సాహసాలకి నాకు చాలా ఆనందంగా వుంది.

లలిత:- మా నాన్నగారిమాట నాకు తెలుసు. ఆత్మ గౌరవం పోయిన తరువాత మానవుడు బ్రతికి ప్రయోజనం లేదంటారు. మీ నాన్నగారుకూడ— ఈ విషయంలో అన్యథా భావించరనే అను కుంటాను.

మూర్తి:- పూర్తిగా ఆయన అంతే. కాని. పద వులు. గౌరవాలు. బ్రిటిష్‌వారే కొంతకాలం ఇండియాను పాలించవలసిందనే భావాలు. ఆయ నకు ఇంకా పోలేదు పాపం-

లలిత:- అదిగో కాలిజోడు చప్పుడు అవుతూవుంది - ఎవరో వచ్చినట్టున్నారు.

మూర్తి:- ఎవరక్కడ?

దఫేదారు:- (ప్రవేశించి) నేను బాబూ! పోలీసు సూపరెంటుగారు వచ్చారండి. తమర్ని అర్జం టుగా చూడాలంటున్నారు.

మూర్తి:- సావిట్లో కూర్చోపెట్టు వస్తాను.

దఫేదారు (వెళ్లతాడు)

లలిత:- ఏదో కొంప మునిగిందనుకుంటాను.

మూర్తి:- అలాగే కనబడుతోంది (అంటూ వెళ్లి పోతాడు)

(తెరపడగానే వెంటనే తెర ఎత్తాలి కచ్చేరి సావిట్లో పచారు చేస్తున్న డిప్టి పోలీస్ సూపరెంటు) (సశేషము)

—(o)—

ఒక పూటకూలి పెట్టే యింటికి వెళ్ళి "అవ్వగారూ! పూటకు భోజనానికి పదణాలు అంటున్నారుకదా!. నేను యీ పగటిపూటంతా సావకాశంగా భోంచెయ్య వచ్చా!" అడిగాడు ఒకాయన

"అలాగే నాయనా! కాని నీవు కూర్చున్నచోటు నుండి లేవలేనప్పుడు నేను దండోపాయానికి పూనుకో వచ్చు!" అని అన్నది అవ్వ

మరువాడ వెంకటరమణమ్మ

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డెసయింట్-ఎక్సుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## అబ్బాయి లోకపు దివ్యదృశ్యాలు!

[నా విమానాన్ని మరమత్తుచేయటం అంత సులభమైతేనా! ఇంజను చెడిపోయింది. ఆ ఎడారి ప్రదేశంలో కొత్తయంత్రం లభించటం దుర్లభం. చిన్న చిన్న మరమత్తులకోసమని నా వెంట తెచ్చుకున్న సామాన్లతోనే ఆ పనిని ఏదో విధంగా చక్కబెట్టుకుని విమానం తిరిగి ప్రయాణానికి అనుకూలంగా వుండేటట్లు చూసుకోవాలి. అంతకన్నా మరే గత్యంతరం వుంటుంది? ... ...

ఇలాటి విషమావస్థలో అబ్బాయి పైనుంచి రావటం, తన లోకపుకబుర్లతో నాతో కాలక్షేపం చేయటం నా అదృష్టమే అని చెప్పాలి. గ్రహమండలాలనిగురించి కళాశాలలో చదువుతూ వున్నప్పుడు ఎన్నో సంగతులని అవగాహనం చేసుకున్నాను. పైలట్‌గా దేశదేశాల్లో సంచారం చేస్తూవున్నప్పుడూ మరెన్నో అద్భుత విషయాలను తెలుసుకోటానికి అవకాశం లభించింది. ఆ చదువంతా ఒకఎత్తు. అబ్బాయి తన గ్రహమండలాన్నిగురించి, ఇతర గ్రహమండలాలనిగురించి చెప్పతూవున్న సంగతులని వినటంమూలాన ఆ లోకాలని అర్థచేసుకోటం ఒక ఎత్తు. అబ్బాయి గ్రహమండలం చిన్నది. అక్కడ వాడికి కావాలసిన వస్తువులన్నీ లభిస్తాయి. వాటితో తృప్తిపడుతూ వూరకుండే ఘటమైతేగా వాడిది! వాడి వుబలాటమంతా ఇతరలోకాలని చూడాలని, వాటి అంతూ పంతూనంతా యథాతథంగా తెలుసుకోవాలని. ...ప్రారంభంలో నాతో బెట్టుసరిగా వుండటం మూలాన, ఇతర గ్రహమండలాల విషయం అట్టే తెలుసుకోటానికి అవకాశం కలిగిందికాదు కాని క్రమేణ అబ్బాయి తత్త్వాన్ని అవగాహనం చేసుకోటానికి అదృష్టం లభించింది. వాడూ నాతో చనువుగా వుండిపోతూ, అస్తమానమూ కనివిని ఎరగని అద్భుత విషయాలను చెప్పటానికి ప్రారంభించాడు. ......... ]

### I

అబ్బాయి గ్రహమండలానికి చుట్టూ ప్రక్కల్లోనే కొన్ని గ్రహమండలాలు వున్నాయి. మన శాస్త్రజ్ఞులు ఆ మండలాలని గుర్తించగలిగారు. వాటికి పేర్లని పెట్టకపోయినా, తమ పంథాలోనే 325, 326, 327, 328, 329, 320 అని సంఖ్యలని వాటికిచ్చారు. ఆ గ్రహమండలాల్లో సంచారంచేస్తూ అక్కడి సంగతి సందర్భాలని తెలుసుకుంటూ వుండటం అబ్బాయికి ఎంతో సరదా ... ...

అబ్బాయి నాకు చెపుతూవున్న కబుర్లనిబట్టి వీటిలో మొదటి గ్రహమండలంలో ఒక రాజు వున్నాడు. ఆయన దర్జా ఇక చెప్పటం అనవసరం. అస్తమానమూ సింహాసనంమీదే కూర్చుంటూ

వుండాలి. బంగారు కిరీటం, అమూల్యమైన దుస్తులు వేసుకోవాలి. రాజలాంఛనానికి తగిన ఆభరణాలని ధరించాలి. తనకేసి వచ్చేవాళ్లతో కబుర్లు చెప్పుకుంటూ ఆనందించటమంటే ఈ రాజుకి ఎంతో సరదా. మన అబ్బాయి ఈ రాజుగారి దర్బారులోకి ఒక రోజున ప్రవేశించాడు. రాజు అబ్బాయికేసి తదేక దృష్టితో చూస్తూ "వచ్చే ఈ అబ్బాయి నాకు నచ్చినవాడే" అని బిగ్గరగా అన్నాడు. అబ్బాయికి ఆయన మాటలు వినబడ్డాయి; తను ఆ పరిసరాలకి క్రొత్త. రాజు తనని ఇలా ఎందుకనటం అని అబ్బాయి ఆశ్చర్యపడుతూ తనలో తను అనుకున్నాడు.

రాజులంటే రాజులే! వాళ్ల అధికారానికి అంతూ పంతూ వుంటుందా! రాజుల పెత్తనంక్రింద వుండేవాళ్లంతా వాళ్ల ఆజ్ఞల్ని తూచా తప్పకుండా నెరవేర్చి తీరాలసిందేగా! అబ్బాయి లోపలికి ప్రవేశించాక, చటుక్కున ఒక నిమిషం ఆగి, నలుప్రక్కలా కలయచూశాడు. రాజు ఇదంతా చూస్తూ అబ్బాయిని తన దగ్గరకే రమ్మని సంజ్ఞచేస్తూ "తిన్నగా నా సింహాసనం ముందుకే రా. అప్పుడు నిన్ను బాగా చూడటానికి వీలుంటుంది" అని అన్నాడు. ఆ మాటల్లో గర్వం తొణికిసలాడుతూవుంది! తను రాజు! తన పరిసరాలలో తారట్లాడుతూ వుండేవాళ్ల సంగతులన్నిటిని తెలుసుకోటం రాజు పనిగా!

అబ్బాయి నదురూ బెదురూ లేకుండా రాజు దగ్గరికి వచ్చాడు. ఆయన ధరించిన దుస్తులని ఎగాదిగా చూశాడు. వాటిలో రాజు వేసుకున్న కోటు సామాన్యమైంది అయితేగా! అపరూపాలయిన రంగు రంగుల బట్టలతో తయారుచేయబడింది. అమూల్యమైన ఆభరణాలతో అలంకరించబడ్డది. ధగధగమని మెరుస్తూ ఆ పరిసరాలకే ఏదో క్రొత్త కళనిస్తూవుంది. దానికేసి ఎంతచూసినా తనివితీరుతుందా? ఎంతసేపు అలా చూస్తూ తన్మయుడగుతున్నాడో? ... అలా చూస్తూ చూస్తూ వున్నమన అబ్బాయి కొంత సేపటికి అలసిపోయాడు. దాంతో ఆవలింత వచ్చింది.

రాజుకి ఇదంతా నచ్చిందికాదు. "రాజు దగ్గర ఎలా వుండాలో నీకు తెలిసినట్లు లేదే! అలా ఆవలిస్తూ వుండడం అమర్యాద." చుర్రున చూస్తూ అన్నాడు రాజు.

"ఆవలించటం అమర్యాదే! కాని నన్నేంచేయమంటావు? రాత్రింపగళ్లు దేశాలని చుట్టివస్తూ వున్నాను. ఒక్క నిమిషమైనా విశ్రాంతి తీసుకోటానికి వీలుంటేనా! ... " అని గుక్కతిప్పకుండా ఏమేమో చెప్పబోతున్నాడు అబ్బాయి.

ఆ మాటతో రాజుకి జాలివేసింది. "పాపం! అలాగా! .. అలాగయితే నువ్వు నిరభ్యంతరంగా ఆవలించవచ్చు. ఆవలిస్తూవుండేవాళ్లనిచూసి ఎంతో కాల మైంది. కావలసినంత విశ్రాంతి వుండటం మూలాన ఆవలించటం పూర్తిగా మరిచి పోయాను. ... నువ్వేం భయపడనక్కర లేదు. బాగా ఆవలించు. .. నువ్వు ఆవలించాలని ఆజ్ఞనిస్తూవున్నానుకూడా" అని రాజు సాధికారంగా అన్నాడు.

"మీ మాటలని వింటుంటే భయం వేస్తున్నది. ఆ భయంలో ఎలా ఆవలించ గలుగుతాను? ... ..."

"ఎందుకలా భయపడటం? ఇప్పుడు ఆవలించకపోతే తరువాతనైనా ఆవలిం చాలి. తెలిసిందా మరి? ఇది నా ఆజ్ఞ" అన్నాడు రాజు.

11

రాజు తనని అలా ఆజ్ఞాపించటం అబ్బాయికి నచ్చిందికాదు. తన అసమ్మ తిని ప్రకటించటానికి గాను అబ్బాయిఏదో గొణుక్కున్నాడు. రాజు అదంతా చూస్తూ, విచారపడుతూ "నేను ఏదైనా ఆజ్ఞ ఇచ్చానే అనుకో ... నామంత్రితో 'నువ్వు పక్షిగా మారాల'ని అంటానే అనుకో. అతను అలా పక్షిగా మారకపోతే, దాని కోసం అతన్నెందుకు శిక్షించాలి. తప్పంతా నాదే ... " అని రాజు ఏదో చెప్ప బోతున్నాడు.

7

అబ్బాయి అలసిపోయాడు. ఈ మాట లన్నీ అయోమయంగా వున్నాయి వాడికి. "కొంచెం కూర్చోవచ్చా" అని అమా యకంగా అడిగాడు రాజుని బితరబోతూ.

"ఆ! తప్పక నువ్వు నా ప్రక్కనే కూర్చో వాలని నా ఆజ్ఞ" ప్రక్కనున్న ఖాళీస్థలాన్ని చూపుతూ అన్నాడు రాజు. అలా అంటూ వున్నప్పుడు రాజు చూపెడుతూవున్న అట్ట హాసాన్ని చూసేతీరాలి. దాంతో వేసు కున్న కోటు కొంచెం కదిలింది. అలా కదల టంతో దాన్లో నుంచి దేదీప్యమానంగా వస్తూవున్న కాంతి ఇంత అంత అని చెప్పాలా! .....దాన్నంతా అబ్బాయి తదేక దృష్టితోచూస్తూ విస్తుపోతూ "రాజా! మిమ్మల్ని ఒకటి అడగవచ్చునా?" అని అబ్బాయి అడిగాడు.

"ఆ! తప్పక అడుగు." అని దరహాస వదనంతో అన్నాడు రాజు.

"రాజా! ..... మీపెత్తనమంతా ఎవళ్లమీద?"

"అందరిమీదా పెత్తనం చేయటానికి అధికారం వుంది" ఠీవితో జవాబిచ్చాడు రాజు.

"అందరిమీదా అంటే?"

అంటే ఏమిటో అర్థమయ్యేటట్లు క్రింద నున్న గ్రహమండలాలని, పైనున్న గ్రహ మండలాలని వ్రేలితోచూపుతూ వాటి మీదంతా తనకు అధికారం వున్నదని గంభీరంగా అన్నాడు రాజు. (సశేషము)

(72 వ-పేజి తరువాయి)

వాడకందార్లకు చౌక ధరలకు చేనేత వస్త్రాలను లభింపజేయడానికి, ఉత్పత్తి ప్రమాణాలను అభివృద్ధిచేసి నాణ్యమైన వస్త్రాలను తయారు చేయడానికి చేనేత పరిశ్రమ ఎక్కువ శ్రద్ధ వహించాలి. నాణ్యానికి తగిన ధరకు వస్త్రాలను లభింపజేస్తేనే చేనేత పరిశ్రమ దేశ ఆర్థికవ్యవస్థలో శక్తివంతమైన అంతర్భాగంగా వర్ధిల్ల గలుగుతుంది. అనేక శతాబ్దాలుగా మన చేనేత వస్త్రాలు ప్రపంచ ప్రసిద్ధిని పొందాయి. నాణ్యాన్ని ప్రమాణీకరించి వాడకందార్ల అభిరుచిలకు తగినట్లు చౌక ధరలకు చేనేత వస్త్రాలను తయారుచేస్తే యీ వస్త్రాల ఎగుమతులు పెంపొందగలవు. చేనేత సహకార సంఘాలు, ప్రజలు, ప్రభుత్వం కృషి చేసి యీ లక్ష్యాన్ని సాధించగలవనడంలో నా కెట్టి సందేహంలేదు. భారత చేనేత పరిశ్రమకు ఉజ్జ్వలమైన భవిష్యత్తువున్నది.

అఖిలభారత చేనేత బోర్డు అధ్యక్షుడు
శ్రీ డి. ఎస్. జోషి:—

ఈ "ఏడాది కూడా ఫిబ్రవరి 8 నుంచి 15 వరకు చేనేత వారోత్సవాలు నిర్వహింపబడుతున్నాయి. ఈ పరిశ్రమ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అనేక మందికి ఉపాధి కల్పిస్తున్నందున దీని కొక విశిష్ఠ స్థానమున్నది.

ఈ పరిశ్రమ గతంలో అనేక సాధక బాధకాలను తట్టుకొన్నది. భారత ప్రభుత్వం మిల్లు వస్త్రాల ఉత్పత్తిని పరిమితం చేయడంవల్లా, కొన్నిరకాల ఉత్పత్తులను చేనేత పరిశ్రమకు ప్రత్యేకించడంవల్ల చేనేత పరిశ్రమకు మంచి భవిష్యత్తు వున్నదన్న విషయం స్థిరపడింది. ఫలితంగా వస్త్రాలకు సంబంధించిన ప్రాథమికావసరాలలో ఏర్పడిన అదనపు అవసరాన్ని చేనేత పరిశ్రమ తీర్చవలసివున్నది. మరమగ్గాల రంగంలోకూడా ఉత్పత్తులు క్రమబద్ధం చేశారు. ఈ పరిశ్రమ యిప్పుడు యీ అదనపు అవసరాలను తీర్చాలి.

"చేనేత పరిశ్రమ యిటు భాగ్యవంతులకు, అటు బీదవారికి పనికివచ్చే వివిధ రకాల వస్త్రాలను తయారుచేస్తున్నది. చేనేత పారిశ్రామికులు యిందుకవసరమైన కళా ప్రావీణ్యాన్ని, నేర్పరితనాన్ని కలిగివున్నారు. చేనేత వస్త్రాలలో కొన్ని అందానికి, లాలిత్యానికి, సృజనాత్మక కృషికి మచ్చుతునకలు.

ప్రతి వ్యక్తీ, ప్రతివర్గం సహకరించి కృషిచేస్తేనే ప్రజల జీవన ప్రమాణాలు పెంపొందగలవు. మగ్గంవారీ ఉత్పత్తి పెంపొందితే చేనేత కార్మికుని ఆదాయంకూడా పెరుగుతుంది. ఉత్పత్తుల పెంపుదల కృషికి చేనేత పరిశ్రమ ముందు దారి చూపగలదు. ఇది జరగాలి.

"చేనేత పరిశ్రమ ఉత్పత్తులను పెంపొం

డించడానికి, నాణ్యం, నమూనాలను అభివృద్ధి చేయడానికి అఖిలభారత చేనేత బోర్డు సహాయపడుతున్నది. ప్రజలకు సేవ చేయడంలో యీ పరిశ్రమ ముందంజవేయగలదనీ, ప్రజలు యీ పరిశ్రమకు చేయూతనిచ్చి దాని అభివృద్ధికి తోడ్పడగలరనీ విశ్వసిస్తున్నాను.''

ఈ ఉత్సవాల ప్రాముఖ్యాన్ని పేర్కొంటూ, యీ సప్తాహం జయప్రదం కావాలని కోరుతూ ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, బీహారు, రాజస్థాన్, బొంబాయి, మధ్యప్రదేశ్, పంజాబ్, ఆంధ్రప్రదేశ్, మద్రాస్, కేరళ రాష్ట్రాల ముఖ్యమంత్రులతో సహా జమ్ము—కాశ్మీర్ మంత్రి సందేశాలు పంపారు.

—(౦)—

చిత్రసమీక్ష:

## విజయావారి 'అప్పుచేసి పప్పుకూడు'

—(౦)—

విజయా ప్రొడక్షన్స్‌వారి 'అప్పుచేసి పప్పుకూడు' చిత్రము యావదాంధ్ర దేశములో విడుదలయింది. శ్రీ యన్. టి. రామారావు, సి. యస్. ఆర్., శ్రీమతి సావిత్రి, జమున, జగ్గయ్య, రేలంగి మున్నగువారు యిందులో నటించారు. పెద్దల పొరపాట్లను వారి మనస్సు నొవ్వకుండా పిన్నలు సరిదిద్దడంతో పాటు మోసానికి మోసం ఫలితం కాగలదనే నీతితో హాస్యరసభరితంగా యీ చిత్రము రూపొందడానికి ప్రయత్నము జరిగింది. లోపలలోపాయకము, పైన బటారమయినా ఆడంబరాలకుగాను, విలాసాలకుగాను పెద్ద మనుష్యులమనుకొనేవారు చేయు సాహసాలు, అకృత్యాలు, ఆర్భాటాలు ఒక కుటుంబ చరిత్రద్వారా చిత్రించబడింది.

కథ, మాటలు మరింత సహజంగా నడచియుంటే బాగుండేది. కొన్ని సన్నివేశాలు, సందర్భాలు కృత్రిమంగాను, అనవసరంగాతోచినా యిందులోని హాస్యము కడుపుబ్బ నవ్వుటకు కారణమయింది. మ్యూజిక్ డైరెక్టరుగా శ్రీ రాజేశ్వరరావు ప్రజ్ఞావిశేషాలు మరింత మనోజ్ఞమైన సంగీతమును సమకూర్చవలసినది; అయినా సంగీతము విన సొంపుగా నుండె



శ్రీమతి అనసూయ శర్మ

- న్యూఢిల్లీలో యిటీవల దక్షిణ భారత నటీనట
- సమాఖ్యవారు ప్రదర్శించిన 'కప్పలు' అనే నాటకంలో కమల పాత్రను అద్భుతంగా నటించి ప్రేక్షకుల మన్ననల బడసినది.

నది. ఛాయా గ్రహణం, సెట్టింగులు ఉత్తమ స్థాయిలో నుండినవి.

నటీనటులలో కుమారి జమున, జగ్గయ్య, సి. యస్. ఆర్. గారలు చక్కగా నటించారు. శ్రీ రంగారావు, రేలంగి గారల నటన సహజంగాను, ఉత్తమంగా నుండింది.

ఈ చిత్రము హాస్యరసముతో ప్రజలను రంజింప చేయగలదు.

••••o••••

## అన్నపూర్ణా వారి 'మాంగల్య బలం'

—o—

'మాంగల్యబలం' విడుదలయిన ఉత్తమచిత్రాలలో నొకటి. కథ, మాటలు, పాటలు పొందికగా నున్నవి. సంగీతమును గురించి చెప్పతగిన విశేషము ఏమిలేకపోయినా మనోజ్ఞంగా నుండింది.

ఇందులో కొన్ని సన్నివేశాలు అనవసరంగా తోచినా ప్రేక్షకులకు చిత్రము విసుగు కలిగించదు. శ్రీ A. నాగేశ్వరరావు, సావిత్రి, రమణమూర్తి, రంగారావు, కన్నాంబగారలు యీచిత్రములో ఉత్తమంగా నటించారు. రేలంగి, రమణారెడ్డిగారల నటన సహజంగాను, ఆకర్షణీయంగా నున్నది.

'మాంగల్యబలం' చిత్రం ప్రజలను బాగా ఆకర్షించగలదని మా విశ్వాసం. ఆ చిత్ర నిర్మాణంలో ప్రజానురంజకంగాను, ఉపయుక్తంగాను రూపొందించాలనే అన్నపూర్ణా పిక్చర్స్‌వారి ఆసక్తి, కృషి ప్రతిఫలిస్తున్నవి.

—పున్నయ్య

పెనుసీలా ప్రొడక్షన్స్‌వారు సమర్పించు 'శ్రీకృష్ణ పాండవ యుద్ధం' చిత్రం శోభాయమానంగా తయారైంది. ఇందులో మహిపాల్, సాహుమోడక్, నళినీజయవంత్ మొదలగువారు నటించారు. అనిశెట్టిగారి మాటలు, పాటలు పసందుగా నున్నవని, మనోజ్ఞమైన సంగీతమని, ఘంటసాల, సుశీలగారల ప్లేబ్యాక్ పాటలు ప్రత్యేకమైన ఆకర్షణయని వార్త. ఈ చిత్రము త్వరలో విడుదల కాబోతున్నది. ఈ చిత్ర నిర్మాతలు విజ్ఞాన వినోదాలను వెదజల్లే బాలల చిత్రాన్ని నిర్మించుటకు సర్వ సన్నాహాలు చేస్తున్నారు.

—o—

మెట్రోపాలిటన్ పిక్చర్స్‌వారు 'గురుదక్షిణ' యనే చిత్రాన్ని తయారు చేస్తున్నారు.

♦ ♦ ♦

పద్మశ్రీ ఫిలింస్ వారి 'వేంకటేశ్వర మహాత్మ్యం' చిత్రర తయారగుతూయున్నది.

♦ ♦ ♦

మద్రాసు రాయల్ స్టూడియోస్ వాడు 'దేవ సుందరి చిత్రాన్ని' విడుదలకు సిద్ధంచేశారు. ఇందులో శ్రీమతి జానకి, శ్రీ కాంతారావు, రాజనాల మొదలగు వారలు నటిస్తున్నారు. శ్రీ హెచ్. వి. బాబు దర్శకత్వము.

—o—

హాలీవుడ్ ప్రఖ్యాత చలనచిత్ర నిర్మాత శ్రీ సి. యల్. బి. డిమిలీ 77-వ ఏట మరణించారు. వీరు 'టెన్ కమాండ్‌మెంట్స్', 'సామ్సన్ డిలైలా' లాంటి ఉత్తమ కళా ఖండాలను సృష్టించి అఖండ కీర్తి నార్జించారు.

వీరు ప్రపంచంలో ఉత్తమచలనచిత్ర నిర్మాతలలో నొకరు.

'డిమిలీ' మరణంవల్ల హాలీవుడ్ ఒక ఉత్తమ నిర్మాతను పోగొట్టుకున్నది.

# శ్రీ సాయిబాబా ప్రవచనములు



మూలం :
శ్రీ స్వామి కేశవయ్యాజీ

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య

"భక్తి విశ్వాసములతో నాకు ఆత్మార్పణము చేసి, నన్ను నిరంతరము జ్ఞాపకముంచుకొనిన వారి 'అహం' నశించి, అజ్ఞానము మాయమగును. అట్టి వారు అన్ని ప్రాపంచిక బాధలనుండి విముక్తులయి ముక్తిపథమును చేరగలరు."

"'సాయి! సాయి!' అని నానామస్మరణ చేయువారి వాక్, శ్రవణదోషములు, పాపములు పరిహారమగును"

"నా కథలను శ్రద్ధాసక్తులతో విన్నవారి మానసిక శారీరక బాధలు నివారణమగును"

"నీవు ఏమి చేసినను, ఎక్కడున్నను, నీవు చేయునదంతయు నాకెరుకయై యుండును. అది జ్ఞాపకముండనిమ్ము! నీవు నా అండదండలనర్థించి నన్ను తలచుకొనగానే నీతోయుందును. భయపడబోకు!"

"నన్ను విశ్వసించి తమ భారమును నా పైనుంచినచో ఆ భారమును నేను మోసి వారిని రక్షించెదను."

"ప్రాపంచిక విషయాలను, విలాసాలను విడనాడి నన్ను రక్షకుడుగా నమ్మినవాడు పరమార్థ సాధకుడు కాగలడు. శారీరక, ఆత్మల విషయములో అతడు భయపడవలసిన అవసరములేదు. నా భక్తులయిండ్లలో అన్న వస్త్రముల కన్నడు కరువుండదు" "నేను సర్వాంతర్యామిగా నుండ మీకేల భయము! నా భక్తుల యోగక్షేమముల పట్ల నేను నిరంతరము ఆసక్తి చూపుచునేయుందును. నా భక్తుడు పతనావస్థలోనున్నచో అతనిని రక్షించుటకు నేను సర్వసిద్ధముగానుందును. అడుగడుగునా మిమ్ములను రక్షించవలసియున్నది. అలా కాకున్నచో ఏమి జరగనున్నదో భగవంతునకే తెలియును!"

"నన్ను నమ్మి తమ సర్వస్వమును నా కరమొనర్చిన వారిని పతనము చెందనీయను. వారిని రక్షించి కాపాడుటకు నా తలనైన బెట్టెదను. భక్త పరాధీనుడనుగా నేను నా భక్తులకు బానిసను."

"గురువును పూర్తిగాను, నిండుహృదయంతో నమ్ముము! అనుమానములను విడనాడుము. అదే సాధన. గురువు భగవంతుడు; సర్వ స్వరూపి. ఆయన మీ తల్లి, తండ్రి, మీ హితము కోరువాడు, బంధువు, స్నేహితుడు. సర్వమును గురువు స్వరూపంగా చూడటం ఉత్తమోత్తమ స్థాయినందుకున్నట్లు కాగలదు. నన్ను ప్రతిజీవిలోను చూడగలవాడు నాతో సమానముగా దివ్యత్వము నొందగలడు"

"మానవుని జీవయాత్రలో కష్టములకు, దుఃఖములకు మానవుడు 'అహాది'ను చంపుకోలేకుండుటయే కారణము. మానవుడు తనశరీరమే అత్యంత ప్రధానమైనదిగా తలచుచున్నాడు. అహంమే లోకములోని అశాశ్వతములు, అనిశ్చితములయిన సుఖదుఃఖములను సృష్టించునది. ఇంద్రియముల కందుబాటులోగల అనేక వస్తువుల, విషయముల మిశ్రమము యీ ప్రపంచము. మానవుడు యుక్తాయుక్తపరిజ్ఞానంతో ఇంద్రియ

నిగ్రహము నవలంబింపవలెను. ఇంద్రియ నిగ్రహమువలన వాస్తవిక పరిజ్ఞానమునుపొంది ఆత్మ సాక్షాత్కారమును పొందగలడు. దానివలన 'అహం' నశించి పరిపూర్ణశాంతి, పరమాత్మ సాక్షాత్కారము సమకూరగలదు. యదార్థమునకు ఆత్మకు ప్రత్యేక వ్యక్తిత్వమున్నది. ఇతర బుద్ధి, ఇంద్రియ నిర్మితములైన పొరలు, రూపములు భ్రమలై, వాస్తవిక ఆత్మజ్ఞానమునకు మానవుని దూరము చేయుచున్నవి. ఆత్మ చలనములేనిది. గురువు బుద్ధి, ఇంద్రియములచే నేర్పడు అనేక భ్రమలనుండి మానవుని 'అహం'ను తప్పించుట కనువుగా అజ్ఞానమును పారద్రోలును. ఆత్మ యనునది నిరంతరమైనది, సత్యస్వరూపమయినది, శాశ్వతమైనదీను. ఆత్మ శాశ్వతముగా నుండినది, ఉండునది, ఉండబోవునది. ఆత్మకు ఆది అంతము లేదు. ఆత్మ రూపరహితమైనదే కాక ఆకారంలోను, విస్తరణలోను పరిమితిలేనిది.

ఆత్మలేనిదే బుద్ధి, దేహము, ప్రపంచముల ఉనికికి అవకాశములేదు. బుద్ధి, దేహము, ప్రపంచములు నీడలవంటివి. ఆత్మజ్ఞానులకు బుద్ధి, శరీరములవలన ఏర్పడు పరిణామములు, దృశ్యములు వాటంతటవే మాయమగును. ఆత్మ వివేకా వివేకాల కతీతమయినది. వివేకము ఒక సాధనమేకాని మంచి చెడ్డల నిర్ణయించి, అమలుజరుపగల వ్యక్తిత్వము కలదికాదు. సంసార జీవయాత్రలోని భ్రమలనుండి, కష్టములనుండి, దుఃఖములనుండి విముక్తి నొందుటకు సద్గురువు ఆశ్రయము అత్యవసరము. ప్రతి క్షణము భ్రమలు, చెడ్డ తలంపులు, తరంగాలు తరంగాలుగా మానవుని తల్లక్రిందులు చేయ ప్రయత్నించవచ్చును. అప్పుడు సముద్ర ప్రవాహంలో మునిగిపోనున్న ప్రమాదావస్థలోని వ్యక్తి ప్రాణరక్షణకొరకు తపించి ప్రయత్నించునట్లు ఒక గురువును విశ్వసించి ఆశ్రయించి రక్షణ పొందవలసి యున్నది. గురువును దృఢముగా విశ్వసింపుము!

అద్దము దుమ్ముధూళి ఆవరించి యున్నంతకాలము సూర్యుని ప్రతిఫలింపచేయలేదు. దుమ్ముధూళిని తుడిచివేయగానే సూర్యరశ్మి ప్రసరించును. అట్లే మన బుద్ధికూడ మన బుద్ధి చెడుతలంపులతోటి, దురాశలకు లోనైయుండునంతకాలము ఆత్మ వికాసము చెందజాలదు. బుద్ధి మాలిన్యము తొలగి పరిశుద్ధమయి ప్రశాంతమయినప్పుడు జ్ఞానము ప్రకాశించి నిజమైన ఆత్మ ప్రతిఫలించును. "ప్రతిజీవియందును నన్ను చూడకలిగి, ప్రతి జీవికి ఆహారమిడినచో నాకు నివేదన చేసినట్లే యగును. అట్లు చేసినవానికంటె నాకు ప్రియమైనవాడు మరొకడు లేడు. ఏ జీవికి హాని కలిగించకూడదు. బీదవారిపట్ల, దీనులపట్ల కఠినముగా వ్యవహరింపకుము. అసహ్యకరమైన వ్యాధులతో బాధపడుచున్నవారినిచూచి ఛీదరించుకొని మనసు నొప్పించకుము. వీని అన్నిటిలో నన్ను చూడుము! మీరట్లు చేసినచో జనన, మరణాలవలన భయము ఉండదు.

"అదృష్టవంతులయి, వారి పాపముల పరిహారమునకు కాలమాసన్నమయినప్పుడు నా శరణుజొచ్చి నన్నారాధింతురు. నన్ను ఆరాధించుటకు ఆడంబరము ఏమియు నవసరములేదు. తదేక ధ్యానముతో, పరిపూర్ణమైన భక్తితో నిండిన హృదయముతో నా నామమును 'సాయి! సాయి!' స్మరించుడు. క్షణములో మీ కష్టములన్నియు మాయమగును. మిమ్ములను పాపములనుండి విముక్తి కావింతును. దీనిని నమ్ముము!"

(సశేషము)

# సంపాదకీయములు

## జాతీయ కాంగ్రెస్ నాయకత్వము

అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌కు శ్రీమతి ఇందిరా గాంధీ అధ్యక్షురాలుగా ఏకగ్రీవంగా ఎన్నికయినందుకు ఆమెను హృదయపూర్వకముగా అభినందిస్తున్నాము. ఇది భారత మహిళాలోకానికి గర్వకారణమయినా ఆమెయన్నట్లు అధ్యక్షస్థానము రోజాపూల పాన్పు కాదు. అయినా ధైర్యంతో ప్రస్తుతపరిస్థితులలో జాతీయ ఆదర్శలక్ష్యాల కనుగుణంగా సేవచేయడానికి, అభివృద్ధి అభ్యుదయాలను రూపొందించడానికి ఆసక్తితో అధ్యక్షపదవి స్వీకరించడం సాహసమనే చెప్పాలి.

గాంధీజీ, పండితజవహర్లాల్ నెహ్రూ, శ్రీ సుభాష్‌బోస్‌లలాంటి అతిరథమహారథులు నిర్వహించినది కాంగ్రెస్ అధ్యక్షపదవి. వారి చిత్తశుద్ధి, సేవాత్యాగాలు, ధైర్య సాహసాలు ప్రజలను చైతన్యవిలసితులను చేసి జాతీయపురోభివృద్ధి నుద్దేశించి ముందుకు నడిపినవి. కాబట్టే వారి నాయకత్వము విశిష్టమైనదియై దిగ్విజయాలను సాధించి దేశానికి స్వాతంత్ర్యము సిద్ధింపజేసినది.

గాంధీజీ స్వాతంత్ర్య సమర సారథ్యానికే కాదు - స్వాతంత్ర్యసిద్ధి యనంతరముకూడ ప్రజాశ్రేయో సౌభాగ్యాలను రూపొందించగల విధానాలను, ప్రణాళికలను రూపొందించాడు. వానిని కాంగ్రెస్ మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించి ఆచరణలో పెట్టడానికి నిర్మాణ కార్యక్రమము సయితము అమలుకు వచ్చింది. కాని గాంధీజీ అనంతరము జాతీయ కాంగ్రెస్ నాయకత్వము వానిని విస్మరించింది. దేశసౌభాగ్యము కొరకు గ్రామాల ఆర్థికస్థితులు మెరుగు కావాలి. యావన్మంది ప్రజలకు తాము చేయగల కష్టానికి, కృషికి ఫలితంగా జీవితావసరాలు అమరాలి. అభివృద్ధి అభ్యుదయాలంటే భారీ పరిశ్రమల నెలకొల్పుట, పల్లెలన్నిటిని విద్యుద్దీపాలతో నింపిపట్నవాసాలుగా మార్చడమయితే ప్రజల స్థితిగతులను సయితము పారమూడవలసి యున్నది. జాతీయ రంగంలో నిరుద్యోగ నిర్మూలనమునకు బదులు, నిరుద్యోగ విస్తరణకు దారితీయగల ఏ విధానాలైనా పరిస్థితులను చక్కబరచజాలవు. ఉమ్మడి శ్రేయస్సు సిద్ధించాలంటే జాతీయ రంగంలో సమైక్యత, ఆత్మ విశ్వాసములను పెంపొందిస్తూ జాతీయ కాంగ్రెస్ దేశాన్ని ముందుకు నడుపాలి. అట్టి గురుతర బాధ్యతను శ్రీమతి ఇందిరా గాంధీ స్వీకరించడం గొప్ప విశేషము.

శ్రీమతి ఇందిరా గాంధీ నాయకత్వంలో జాతీయ కాంగ్రెస్‌కు పూర్వపు కీర్తిప్రతిష్ఠలు సమకూరి ప్రజల ఆదరాభిమానములకు పాత్రము కాగలదని ఆశిద్దాం!

## విజ్ఞానశాస్త్ర లక్ష్యాలు

మానవశ్రేయస్సు నుద్దేశించియే ప్రకృతి సృష్టించబడింది. అయితే మానవుడు తన బుద్ధి వికాసమును, విజ్ఞానమును వినియోగించి యుక్తాయుక్త పరిజ్ఞానంతో స్వీయ సౌభాగ్యాన్ని తీర్చిదిద్దుకోడానికి అవకాశములు ఏర్పడినవి. శాంతి, రక్షణ సౌభాగ్యాలు మానవావసరాలు. వీనిని అమర్చుకోడానికి మానవుడు బుద్ధికుశలతను, అనుభవమును, విజ్ఞానమును, విద్యను వినియోగించుకోడం సర్వదా వాంఛనీయము. స్వీయ సౌభాగ్యమును గుర్తించక అశాంతి అరాజకాములకు తన అపార మేధా సంపత్తిని, విద్యను, పరిశ్రమను వినియోగించినచో అది ఆత్మ విధ్వంసమునకే తోడ్పడగలదు.

ఈ నాటి శాస్త్రపరిశోధనలేమి, విజ్ఞానమేమి మానవ జీవిత మనుగడకు తోడ్పడాలి. మానవశాంతి భద్రతలను నిర్లక్ష్యము చేసే శాస్త్ర విజ్ఞానము, పరిశోధనలు అత్యంత ప్రమాద భరితములు. వానిని ప్రజలు, దేశదేశాల ప్రభుత్వములు గుర్తించి నిరోధించవలసి యున్నది.



అబ్రహాం లింకన్ 150-వ వర్థంతి ఉత్సవాలు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో యీ నెల 12 వ తేదిన వైభవోపేతంగా జరుపబడెను.

## స్వీకారము

శ్రీ జనానంద కళ్యాణ పాటలు : సేకరణ - సాధు లక్ష్మీకాంతమ్మగారు. ప్రచురణకర్తలు : యస్. యస్. ప్రకాశరావు & సన్, పుస్తకముల వ్యాపారము, అత్తోట, తెనాలి. వెల 12 న. పై.

సహజంగా స్త్రీలకు పాటలంటే మోజు జాస్తి. అందులో భక్తి, ముక్తి ప్రదములగు పాటలు సంకీర్తనమున కెంతైనా అనువైనవి. ఇందలి పాటలు స్త్రీలు సులభంగా చదువుకొని పాడుకోడాని కనువుగా ఉన్నవి.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-50 న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయ మూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA




# LODHRA

FOR LADIES' HEALTH

KESARI KUTEERAM Private LTD.
MADRAS-14.

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

LODHRA PRESS, MADRAS-14.